# మిసిమి

***"All that we are is the product of what we have thought, is "We are what we think." — Dammapada.***

సంపుటి 7 ఆగష్టు 1995 సంచిక 73

సంపాదకుడు : **రవీంద్రనాథ్ ఆలపాటి** Ph.D., (U.S.A.)

## విషయసూచిక



విడిప్రతి రూ. 5/- వార్షిక చందా రూ.60/-

ముఖచిత్రం

This picture was inspired by the July Revolution of 1830. Delacroix had not taken part in the fighting and felt that the least he could do was 'paint for his country'. The red, white and blue of the French national flag dominate the composition.

Printed, Published and Edited by Dr. RAVINDRANATH ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337.

**Editorial NEST**

Plot No. 337 A, Road No. 10, Jubilee Hills, Hyderabad - 500 0033. Ph. 247717

# SPENDER, SIR STEPHEN
# ( 1909 - 1995 )

SPENDER, Sir Stephen (Harold) (1909- ), was born in London, and educated at University College School, Hampstead, and Oxford (University College), where he was a contemporary and friend of *Auden, Isherwood and *Mac-Neice. Thus began a famous association with other writers who developed social and political themes from a left-wing standpoint, though his political affiliation (with the Communist Party) was brief. He visited Spain during the Civil War (1936-9), assisting the Republican cause with propaganda activity. During the Second World War he served in the National Fire Service in London, and was for two years co-editor, with Cyril Connolly, of the literary monthly *Horizon.* His contribution to the volume of essays *The God that Failed (1951),* and his reversal of the critical position he adopted in *The Destructive Element (1935)* with the publicatiion of *The Creative Element (1953),* establish his rejection of Communism in favour of a liberal individualism. In the later year he became inaugural co-editor of *Encounter,* an anti-Communist political and literary monthly supported initially by the US Central Intelligence Agency. By this time his main period of creativity as a poet had virtually ended though his work as a critic, and as a translator of Spanish and German (and later, Greek) poetry and drama continued and expanded.

Spender's early verse (in books such as *Poems, 1933*, and *The Still Centre, 1939)* catches movingly the alarm and confusion in the atmosphere of 1930s Europe, and affirms, in poems like 'The Funeral' and 'An Elementary School Classroom in a Slum', the political values he then held (a very personal, humanistic socialism). It also deliberately substitues for the traditional English poet's devotion to nature a celebration of technological achievement ('The Express' and 'The Pylons'). At this time he displays at his best an eloquent Romantic pity for the poor and the oppressed, and a gift for rendering scenes of wartime suffering and destruction (in Spain, and in London during the air-raids) with photographic accuracy, even if the images sometimes remain somewhat unfocused. These prominent features of his poetry diverted attention at first from the presence of a deeply self-questioning personality, unsure how to match poetry to either external events or his own feelings. How he should, or could, commit himself emotionally is a recurrent theme; reassessment and revision of the poems is a constant habit. He is only too aware of a heritage of daunting greatness (in Beethoven, say, or Holderlin) which transcends his untidy and violent modern experience.

- EDITOR

# గ్రీక్ తాత్విక చింతన

- ఏటుకూరు బలరామమూర్తి

తత్వశాస్త్రానికి గ్రీస్ పుట్టినిల్లు. మతశాస్త్రానికి(Theology), విజ్ఞానశాస్త్రానికి(Science) మధ్యస్థంగా ఉంటుంది తత్వశాస్త్రం. విశ్వాసంపై ఆధారపడినది మతశాస్త్రం. ఈనాడే కాదు, ప్రాచీనకాలంలో కూడా మేధావులను ఇది ఆకట్టుకోలేకపోయింది. ప్రయోగం, పరిశోధనలపై ఆధారపడినది విజ్ఞానశాస్త్రం. ప్రాచీనకాలంలో ఇది చాలా తక్కువస్థాయిలో ఉండేది. ప్రాచీన గ్రీకు తత్వవేత్త లందరూ ఏదో ఒకస్థాయిలో భౌతికశాస్త్రంపై ప్రయోగాలు చేసినవారే.

జీవితానికి సంబంధించిన అనేకానేక సమస్యలు అపుడూ, యిపుడూ ఉంటూనే ఉన్నాయి. మానవుడు ఎలా ఆవిర్భవించాడు ? జీవితలక్ష్యం ఏమిటి? అసలు లక్ష్యం అంటూ ఒకటి ఉందా? మానవుడు తనకు తానై ఒక లక్ష్యాన్ని, గమ్యాన్ని ఏర్పరచుకుంటాడా? లేక ఈశ్వరుడు ముందుగా నిర్దేశించిన లక్ష్యం అంటూ ఒకటి ఉన్నదా?

సమాజంలో మానవుడు ఎలా జీవించాలి? నీతి నియమాల స్థానం ఏమిటి? స్వార్థమే పరమార్థంగా మానవుడు జీవించగలడా? అలా పశు స్థాయిలోనే జీవితం సాగిస్తే, నాగరికత, సంస్కృతి యీ స్థాయికి ఎదిగేవేనా?

ఇలాంటి సమస్య లన్నిటికీ తత్వశాస్త్రం సమాధానం చెప్పటానికి అనాదిగా ప్రయత్నిస్తూ వచ్చింది. కొన్నిటికి సమాధానాలు లభించాయి. చాలా వాటికి సమాధానాలు యిప్పటికీ లభించలేదు.

సమాధానాలు లభించినవి కూడా తిరిగి సందేహాస్పదాలవుతున్నాయి. విజ్ఞానం, నాగరికత, సంస్కృతి పెరిగినకొద్దీ పాత సమస్యలకు కొత్త సమాధానాలు అవసర మౌతూఉంటాయి.

ఈ నిరంతర అన్వేషణే తత్వశాస్త్రం.

గ్రీస్ దేశం తత్వశాస్త్రానికి పుట్టినిల్లు కావటానికి బహుశా కొన్ని భౌగోళిక కారణాలు తోడ్పడి ఉండవచ్చు.

గ్రీస్ చిన్నదేశం . కొండలు, కోనలతో నిండి, ప్రతి లోయలోనూ, మెట్ట ప్రాంతంలోనూ ఒక నగరం ఉండేది. ఒక నగరానికి, మరొక నగరానికి రాకపోకలే తక్కువ. ఎవరి రాజ్యం వారిదే. వ్యవసాయం బహుస్వల్పం.

సముద్ర తీరవాసులు తప్పనిసరై ఓడ వ్యాపారం నేర్చుకున్నారు. అది వారికత్యవసరమైన జీవనాధారం. మధ్యధరా సముద్రంలోని దీవులతో వ్యాపారం చేసేవారు. కొందరు అక్కడకు వలస వెళ్ళారు కూడా.

ఈ దీవుల సముదాయాన్ని ఆసియా మైనర్ అనేవారు. తూర్పున ఎక్కడో ఆసియా ఖండం వున్నదనే స్పృహ గ్రీకుల కుండేది. అక్కడ గొప్ప నాగరికతా కేంద్రాలుండేవని కూడా వారు కర్ణాకర్ణిగా విన్నారు. కనుక ఈ దీవుల సముదాయాన్ని వారు ఆసియా మైనర్ అన్నారు.

అందులో ఒకటి అయోనియా. అయోనియా ద్వీపంలో ముఖ్యనగరం మైలీషియా. గ్రీకు తత్వవేత్తలు మొదట యిక్కడ తలెత్తారు.

వీరిలో ప్రప్రథముడు థేల్స్. ఇతడు క్రీ.పూ. 624-500 సంవత్సరాల మధ్య జీవించాడు. ( క్రీ. పూ. సంవత్సరాలు పైనుండి క్రిందకు వస్తాయి. 624 తర్వాత 23, 22 యిలా క్రిందికి వస్తాయి).

గణిత శాస్త్రం, ఖగోళశాస్త్రాలలో ఇతనికి ప్రవేశముంది. లౌకికమైన తెలివి తేటలు, తాత్వికమైన

జ్ఞానసంపదరెండూ ఉండేవని చెబుతారు. భారతదేశం సప్తరుషులను గురించి గొప్పగా చెప్పుకున్నట్లే, గ్రీకు దేశస్థులు సప్తజ్ఞానులను గురించి చెప్పుకుంటూ ఉంటారు. సప్తజ్ఞానులు ఎవరు అనే విషయంలో చాలా కథనాలు ఉన్నాయి. అన్ని కథనాలలోనూ థేల్స్ పేరు ఉండటంవల్ల, ఆనాడు యితడిని గొప్ప జ్ఞానిగా కనీసం ఆ తర్వాతి వారు గుర్తించారని చెప్పవచ్చు.

క్రీ. పూ. 585లో వచ్చిన సూర్యగ్రహణాన్ని యితడు ముందుగానే లెక్కగట్టాడు. క్రోసియస్ అనే రాజు సైన్యంతో ముందుగా సాగుతుండగా ఒక నది అడ్డం వచ్చింది. ఆ నదీప్రవాహాన్ని పక్కకు తిప్పి తన ఇంజనీరింగ్ సామర్థ్యాన్ని థేల్స్ నిరూపించుకోడంతో రాజాదరణ కూడా లభించింది.

థేల్స్ సిద్ధాంతాన్ననుసరించి, మూలవస్తువు నీరు. నీటినుండే సర్వప్రపంచం ఆవిర్భవించింది. భూమి చదరంగా ఉండే పడవలాంటిది. ఇది నీటిపై తేలియాడుతూ ఉంటుంది.

ఆసియా మైనర్‌లోని ద్వీపాలన్నీ, సముద్రంపై తేలియాడే పడవలలాగా ఉండేవి. ఆ ప్రత్యక్షానుభవం నుండే థేల్స్ ఈ సాధారణీకరణ చేశాడేమో?

ఈ సూత్రం తత్వశాస్త్రప్రాదుర్భావానికి వేగుచుక్క.

అంతకు పూర్వం, గ్రీస్ దేశ స్థు లందరూ, తమ దేవతలు అపోలో పర్వతంపై నివసిస్తారని విశ్వసించేవారు. ఇంకా అంతకుపూర్వం గ్రీస్ దేశపు రాజులు తమ పూర్వీకుల మృత శరీరాలను ఒక గుహలో దాచేవారు.

ఆ మృత శరీరాలను సంవత్సరానికొకసారి దర్శించగా, ఆ గుహలో నుండి ఏవో ధ్వనులు వచ్చేవి. వాటిని దేవతల వాక్కులుగా భావించేవారు. దీనినే దివ్యవాణి అనేవారు.

ఈ రెంటినీ మూఢవిశ్వాసలుగా త్రోసిపుచ్చి నీరు మూలవస్తువు అని చెప్పిన థేల్స్ ఆనాటికి నిస్సందేహంగా తత్వజ్ఞుడు, జ్ఞాని. థేల్స్ సైతం దేవతలను, ప్రేతాత్మలను పూర్తిగా నిరాకరించాడనలేము. సృష్టికర్త అయిన ఈశ్వరుడు లేడన్నాడు. కాని ఆకాశం నిండా ప్రేతాత్మలు, దేవుళ్లు ఉన్నాయన్నాడు. వారు కూడా నీటినుండే జన్మించారు. నీటిలోనే తిరిగి చేరిపోతారు. కనుక నీరు మూలవస్తువు అని థేల్స్ వాదన.

తొలి గ్రీకు తత్వవేత్తలందరూ భౌతిక వాదులు. ఏదో ఒక భౌతికమైన వస్తువు సృష్టికి మూలం అని

సూదంటురాయి ఇనుమును ఆకర్షిస్తుంది. సూదంటురాయిలో ఆత్మ లేక ప్రేతాత్మ ఉన్నదని థేల్స్ అంటారు.

ఇలా కొన్ని మినహాయింపు లున్నా, థేల్స్ భౌతికవాదం గ్రీక్ తత్వశాస్త్రానికి తొలిమెట్టు.

## అనగ్జిమాండర్

థేల్స్ శిష్యుడు అనగ్జిమాండర్ (611-547). భౌతిక వస్తువు సృష్టికి మూలాధారం అని అనగ్జిమాండర్ అంగీకరిస్తాడు. దానిని నీరు అని, మరొక నిర్దిష్ట పదార్థమని చెప్పరాదు. నిరాకార, అనిశ్చిత, నిర్గుణ ప్రకృతి మూలం అంటాడు. (భారతీయ సాంఖ్యుల భావన కూడా ఇదే). ఇది నిర్గుణం కనుక అనంతం, అపరిమితం దానిలో నుండి అసంఖ్యాక ప్రపంచాలు ఒక దాని తర్వాత ఒకటి సృష్టి అవుతూ, నశిస్తూ ఉంటాయి.

అవ్యక్త ప్రకృతి ''శీతలం'', ''ఉష్ణం''గా విభజితమౌతుంది. శీతల ప్రాంతం విశ్వం. ఉష్ణప్రాంతం విశ్వం చుట్టూ ఉన్న సూర్య, తదితరగోళాలు.

ఈ గోళాల చుట్టూ ఆవిరి మేఘం ఆవరించి ఉంటుంది. ఈ మేఘంలో కంత లుంటాయి. వీటిలో నుండి మనం సూర్య చంద్రులను చూడగలుగుతున్నాము.

సూర్యుడు మనకు మరీ దూరంలో ఉన్నాడు. చంద్రుడు కొంచెం దగ్గరగాను, నక్షత్రాలు ఇంకాదగ్గరగానూ ఉన్నాయని అనగ్జిమాండర్ సిద్ధాంతం.

భూమి థేల్స్ చెప్పినట్లు చదరంగా లేదు. (కపిత్థాకారం) వెలగపండు ఆకారంలో ఉంది.

సృష్టిక్రమాన్ని కూడా అనగ్జిమాండర్ ఊహించాడు.

మొదట్లో భూమి ద్రవరూపంలో ఉండేది. మొదటి జీవరూపం చేప. మానవుడు చేప ఆకారంలో ఉండేవాడు. జలచరాలు భూచరాలుగా మారటంతో చేపల పొలుసులు రాలిపోయాయి. కాళ్ళు వచ్చాయి.

ఈ సిద్ధాంతానికి అతిశయ ప్రాధాన్యం ఇవ్వనక్కరలేదు. కాని జీవరాశి పరిసరాలతో సర్దుబాటు చేసుకునేకృషిలో పరిణామం జరుగుతూ వచ్చింది అనే ఆధునిక భావనకు ఇది సన్నిహితంగా ఉన్న విషయము కాదనలేము.

థేల్స్ కంటె అనగ్జిమాండర్ తాత్త్విక చింతనలో ఒక ముందడుగు వేశాడు. నీరు అనే నిర్దిష్టవస్తు భావనకంటె అనిర్దిష్ట ప్రకృతి భావన నిస్సందేహంగా ముందడుగు.

నిర్దిష్టత నుండి సాధారణీకరణవైపు పయనించటం తత్త్వశాస్త్ర పురోగతికి చిహ్నం. సాధారణీకరణ జ్ఞానం నుండి నిర్దిష్ట పదార్థాల అధ్యయనం రెండో మెట్టు.

## అనగ్జిమినీస్

ఇతడు కూడా మైలేషియాకు చెందినవాడే. ఇతనికాలం క్రీ.పూ. 588

మూలవస్తువు నీరు కాదు, అవ్యక్త ప్రకృతి కాదు, వాయువు అని అనగ్జిమినీస్ సూత్రీకరణ.

వాయువు విశ్వవ్యాప్తం. సంకోచ, వ్యాకోచాలు వాయువు సహజలక్షణాలు. వ్యాకోచంలో వేడి, సంకోచంలో చలి ఏర్పడుతాయి. సంకోచక్రమంలో వాయువు మేఘాలుగా, నీరు, భూమి కొండలుగా రూపాంతరం చెందుతుంది. వ్యాకోచక్రమంలో వేడి, పిమ్మట నక్షత్రాలు ఏర్పడ్డాయి.

గోళాలు అసంఖ్యాకమని, అందులో ఈ విశ్వం ఒకటి అని అనగ్జిమాండర్ లాగానే అనగ్జిమినీస్ కూడా భావించాడు. థేల్స్‌లాగ భూమి నలు చదరం అన్నాడు.

థేల్స్ ఆలోచనను అనగ్జిమాండర్ ఒక అడుగు ముందుకు తీసుకుపోగా, అనగ్జిమినీస్ తిరిగి థేల్స్‌వలె నిర్దిష్టవస్తువు 'వాయువు' మూలమన్నా డేమిటి? అనే ప్రశ్న వస్తుంది.

తాత్త్విక పురోగతి నిచ్చెన మెట్టువలె సాగదు. ఒక అడుగు ముందుకు, తిరిగి ఒక అడుగు స్వల్పంగా వెనక్కు, స్వల్పంగా వెనకడుగువేస్తూనే, సంకోచ, వ్యాకోచాలనే కొత్త భావనను అనగ్జిమినీస్ ప్రవేశపెట్టాడు.

మైలీషియాకు చెందిన మరికొందరు తాత్త్వికు లున్నారు కాని, వారు ఇంతకంటె అదనంగా చెప్పింది లేదు.

## దక్షిణ ఇటలీలోని ఇలియా

పిమ్మట గ్రీక్ తత్త్వశాస్త్ర వేదిక దక్షిణ ఇటలీలోని ఇలియాకు మారింది. ఇందుకొక కారణం ఉంది. అయోనియన్ దీవిని పర్షియా రాజులు ఆక్రమించారు. తాత్త్విక చింతన అక్కడ అంతరించింది.

సృష్టికి మూల వస్తువు ఏది అని ఇంతకాలం తాత్త్వికులు చర్చించారు. ఒకరు నీరని, మరొకరు వాయువని, మరొకరు అవ్యక్త ప్రకృతి అని అన్నారు.

మూలవస్తువు స్వభావం ఏమిటి? అనేది రెండో ప్రశ్న. కొందరు స్థితి (being) అన్నారు. మరికొందరు గతి (becoming) అన్నారు.

స్థితి అని వాదించిన వారిలో జెనోఫినిస్, పర్మినిడీస్, జీనోలు ముఖ్యులు. గతి అని ప్రతిపాదించిన వారిలో హెరాక్లిట్లస్ ముఖ్యుడు. దాదాపు వీరందరూ సమకాలికులు.

జెనోఫినిస్ (క్రీ.పూ. 576) అయోనియా ద్వీపంలో పుట్టి దేశదేశాలు తిరిగి, దక్షిణ ఇటలీలో ఇలియాలో స్థిరపడ్డాడు. ఇతణ్ణి తత్వవేత్త అనేకంటె మతసంస్కర్త అనటం సమంజసం. గ్రీకులు అంతవరకు బహు దేవతలలో విశ్వాసముంచేవారు. మానవులకు గల సర్వ దుర్గుణాలు దేవతలకు ఆపాదించేవారు. అసూయ, వ్యభిచారం, త్రాగుడు, దొంగతనం, అసత్య ప్రసంగాలు మొదలైన దుర్గుణాలను దేవతలకు ఆపాదించటం అవమానకరం. గ్రీకుజాతికే అగౌరవం అని జెనోఫినిస్ గట్టిగా వాదించాడు.

ఈశ్వరుడు వున్నాడు. అతడు ఒక్కడే. అతడు నిరాడంబరుడు, నిర్గుణుడు, దుర్గుణాలు లేవు, సద్గుణాలు లేవు, జెనోఫినిస్ భావనను పర్మనిడీస్ స్వీకరించాడు. నిరాకార, నిర్గుణ, అచలాయ భావనను ఆమోదించి ఈశ్వరుడు అనే భావనను త్రోసిపుచ్చాడు.

## పర్మినిడీస్

పర్మినిడీస్ (క్రీ.పూ.514) లో ఇలియాలో జన్మించారు. స్థితివాదులలో ఇతడే ఆద్యుడు. జెనోఫినిస్ నుండి ఇతడు స్ఫూర్తి పొందినందున జెనోఫినిస్‌ను ప్రస్తావించవలసి వచ్చింది.

పర్మినిడీస్ క్రీ.పూ. 580 ప్రాంతంలో జీవించిన మార్మికుడు. కాని తాత్విక బీజాలు లేకపోలేదు. సంఖ్య (Number) సర్వ సృష్టికి మూలం అని పైథాగరస్ భావన. ఇదొక తాత్విక భావన. (భారతదేశంలో సాంఖ్యులు కూడా తొలి రోజులలో సంఖ్య మూలం అన్నారు. క్రమంగా సంఖ్య జ్ఞానానికి పర్యాయపదమైంది. తర్వాతి కాలంలో సాంఖ్యం అంటే జ్ఞానమార్గం అనే అర్థం రూఢి అయింది)

పైథాగరస్ భావనలనుండి పర్మినిడీస్ విడివడి స్థితి వాదాన్ని రూపొందించారు. ఈ వాదన సారాంశం ఇది.

సృష్టిలో ప్రతిదీ చలనశీలం. చలనశీలమైనది సత్యం కాజాలదు. విశ్వవ్యాపితమైన చలనశీలత అడుగున శాశ్వత స్థితి భావన ఏదో వుండి వుండాలి. అదే సత్యం. నిత్యం మారేది సత్యం ఎలా అవుతుంది అని పర్మినిడీస్ ప్రశ్న.

స్థితి అనేది స్థితినుండే ఉద్భవించాలి. గతికి ఎలాంటి సంబంధమూ వుండరాదు. స్థితి శాశ్వతం. అచలాయతనం. గతి అశాశ్వతం.

ఈ స్థితిని మానవుడు పంచేంద్రియాల ద్వారా గ్రహించలేడు. బుద్ధి ద్వారా మాత్రమే అర్థం చేసుకోగలడు.

స్థితి నిర్దిష్టమనీ, ఆకాశవ్యాప్తమని (Space), ఆకాశం గోళాకారంలో వుంటుందని పర్మినిడీస్ అంటాడు. కనుక కొందరు ఇతడిని భౌతికవాది అంటారు.

స్థితి పంచేంద్రియాలకు అగ్రాహ్యమని అనటం ద్వారా పర్మినిడీస్‌ను భావవాదిగా మరికొందరు భావిస్తారు.

గ్రీక్ ప్రాచీన తాత్వికులందరిలోనూ ఇలాంటి అస్పష్టత, వైరుధ్యం ఏదో ఒకటి వున్నది. ఆమాటకొస్తే, ప్రాచీన తాత్వికులందరిలోనూ భారత్, చైనా, గ్రీస్- అనే వ్యత్యాసం లేకుండా ఇలాంటి వైరుధ్యం వున్నది.

ప్రాచీన తాత్విక చింతన పరిధిగా (Limit) మాత్రమే దీనిని భావించాలి.

## జీనో

ఇలియాటిక్ ధోరణికి చెందిన మరొక స్థితివాది జీనో. ఇతని కాలం క్రీ.పూ. 489.

పర్మినిడీస్ స్థితివాదాన్ని జీనో సమర్థించారు. దృశ్యమాన ప్రపంచమంతా భ్రమాత్మకం. ఈ ప్రపంచంలో చలనం, బాహుళ్యం- రెండూ వున్నాయి.

చలనం, బాహుళ్యం రెండూ భ్రమలే. కనుక రెండూ అవాస్తవాలు. చలనరహిత, బాహుళ్యరహిత ఏకత్వమే వాస్తవం. పెర్మినిడీస్ కంటె మరొకడుగు వెనక్కు వెళ్ళినవాడు జీనో.

ఒక ప్రతిపాదన నుండి రెండు విరుద్ధ భావనలు ఆవిర్భవించినట్లయితే, అసలు ప్రతిపాదనే లోపభూయిష్ఠము అని జీనో వాదన.

మూలవస్తువుకు పరిమాణం (Quantity), గుణం (Quality) రెండూ వున్నాయి. పైథాగరస్, (Quality) గుణాన్ని తొలగించి, సంఖ్య (Number) అనటం ద్వారా పరిమాణాన్ని మాత్రమే గుర్తించాడు. ఇలియాటిక్ తత్వవేత్తలు గుణాన్ని, పరిమాణాన్ని నిరాకరించి, నిర్గుణ, నిరాకార స్థితి భావనకు వచ్చారు.

భౌతిక ప్రాతిపదిక నుండి గ్రీకు చింతన భావవాదంవైపు సాగింది. ఈ పరిణామానికి అడ్డుకట్ట వేసినవాడు హెరాక్లిటస్.

## హెరాక్లిటస్

ఇతడు (క్రీ.పూ. 535-475) సంవత్సరాల మధ్య జీవించాడు.

ఇలియాటిక్ స్థితి వాదనను పూర్తిగా ఖండించినవాడు హెరాక్లిటస్.

స్థితి మౌలికం కాదు. గతే (becoming) మౌలికం.

ఒకే నదిలో నీవు రెండుసార్లు కాలు పెట్టలేవు. నీరు నిరంతరం ప్రవహిస్తున్నందున ప్రవాహం పైకి కనపడకపోయినా కదలిక నిత్యం.

ప్రతిదీ 'ఉన్నది', 'లేదు' రెండూ కలిసే వుంటాయి. ప్రాణంలో మృత్యువు అంతర్భాగం. అనుక్షణం ఏదో ఒక భాగం సృష్టి అవుతూ వుంటుంది. ఏదో ఒక భాగం మరణిస్తూ వుంటుంది. స్థితి, స్థితిరాహిత్య గతి ద్వారా బంధితం. అంతా క్షణికం (గౌతమబుద్ధుడు దాదాపు ఇదే వాదాన్ని దాదాపు అదే కాలంలో భారతదేశంలో బోధించాడు. గౌతముని కాలం క్రీ.పూ. 563)

ప్రతి వస్తువు వైరుధ్యపూరితం. వ్యతిరేకత ప్రకృతిలో అంతర్గతమైన సహజ సూత్రం. అనుకూల వ్యతిరేకతల సమైక్యతా ఘర్షణలే జీవిత సత్యం.

హెరాక్లిటస్ మాటలలోనే చూద్దాం : ''ఈ ప్రపంచాన్ని దేవతలు సృష్టించలేదు, మానవుల సృష్టించలేదు. ఇది వున్నది, లోగడా వున్నది. ఇకముందూ వుంటుంది. ఇది నిత్య జీవనజ్యోతి''

జ్యోతి అనే మాటను హెరాక్లిటస్ పదేపదే వాడాడు. ఏమంటే జ్యోతి,.... ఒక్క క్షణం కూడా స్థిరంగా వుండదు. కట్టెలలోనుండి నిత్యమూ ఉద్భవించే నిప్పు, పొగ, ఆవిరి రూపంలో ఆ పదార్థాన్ని విసర్జిస్తూ వుంటుంది. నిప్పులోనుండి వాయువు, అందులో నుండి నీరు, పిమ్మట భూమి (నేల) ఏర్పడుతాయి. ఇది అవరోహణ. భూమి, నీరు, వాయువు, నిప్పు - ఇది ఆరోహణ.

ఆరోహణ, అవరోహణ క్రమాలు నిత్యం. ఇదే ప్రపంచం, ఇదే జీవితం.

ఘర్షణ సహజం కనుక సమాజంలో యుద్ధాలు అనివార్యం అని కూడా హెరాక్లిటస్ అంటాడు.

ఆధునిక గతి తార్కిక సూత్రానికి కేంద్ర బిందువు వ్యతిరేక శక్తుల ఐక్యత-ఘర్షణ. ఈ భావనకు ఆద్యుడు హెరాక్లిటస్ అనటంలో దోషం లేదు.

☆



# ధీరోదాత్తుడు
# దివంగత యన్.జి. రంగా

ఆంగ్లమూలం
**హిరేన్ ముఖర్జీ**

తొంభై ఐదేళ్ల నిండు జీవితాన్ని గడిపిన వారెవరైనా, ఏదో ఒకనాడు కాటికి పోక తప్పదు. దాన్ని పెద్దగా పట్టించుకోనవసరం లేదు. కాని, యన్.జి. రంగాను ఎన్నో సంవత్సరాల నుండి సన్నిహితంగా ఎరిగిన వారికి మాత్రం ఆయన మరణం మానసిక ఆవేదనను కలిగించక మానదు. దాన్నుండి బయట పడేందుకు కొంతకాలం పట్టవచ్చు. ఆయన యీ తరానికి పెద్దగా తెలిసి వుండకపోవచ్చు. ప్రస్తుత రాజకీయ నాయకుల వర్గానికి రంగా విభిన్నమైన వ్యక్తి. అంతరించి పోతూవున్న ఆఖరి ప్రజ్ఞాశీలురలో దాదాపు ఆఖరువాడు రంగా కావచ్చు. ఒక్కొక్కప్పుడు కఠినంగా ప్రవర్తిస్తాడు కాని అహంకారం లేని వ్యక్తి. భారత దేశానికే వన్నెతెచ్చిన జాతీయ నాయకుడు రంగా.

రంగా నాకంటె ఏడేళ్లు పెద్ద. మేమిద్దరం సెయింట్ కాథరిన్, ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో ఒకేసారి అడుగు పెట్టాం (మాకు అప్పటికే భారతదేశ డిగ్రీలున్నాయి). అది 30వ దశక ప్రారంభ దినాలు. ఆక్స్‌ఫర్డ్‌లో ఆరోజులే వేరు. అప్పుడు ఆక్స్‌ఫర్డ్ కేంబ్రిడ్జ్ యూనివర్సిటీలు పెడమార్గాలు పట్టిన నూతన తరహా విద్యార్థులతో నిండివుండేవి. ప్రఖ్యాత న్యాయ శాస్త్ర నిపుణుడు జేమ్స్ కామరోన్ మాటల్లో చెప్పాలంటే ''ప్రియమైన పాతరోజులు అవి''. అప్పుడు మేమంతా కమ్యూనిష్టులం. లేదంటే కమ్యూనిష్టులుగా భావించుకునే వాళ్లం. అలా భావించకుండా ఉండలేని పరిస్థితి అది. ఆ జబ్బు నాకూ అంటుకుంది. కాని రంగా తప్పించుకున్నాడు సోషల్ డెమాక్రాట్‌గా రాజకీయ దృఢ విశ్వాసంతో మేథాపరమైన శాంతిని పొందాడు.

ఆనాటి ఎందరో యువకులతోపాటు రంగా కూడా దేశభక్తి ఆవేశంతో వూగిపోయేవాడు. భారతదేశానికి తిరిగి వస్తూనే కొంతకాలం మద్రాసులోని పచ్చయప్ప కాలేజీలో ఆర్థిక శాస్త్రంలో బోధనాచార్యుడుగా పనిచేశాడు. స్వాతంత్ర్య సమరంలో దూకి రంగా రాజకీయాల్లో ప్రవేశించాడు. రాజకీయ కార్య కలాపాల్లో అడపాదడపా జైలుకు వెళ్లాడు. జాతీయ కాంగ్రెసు ప్రజా వేదిక కావడంతో రంగా సహజంగా దాన్లో చేరాడు. స్వతహాగా దేనికీ కట్టుబడి వుండని స్వభావంగల రంగా తన దీర్ఘకాల క్రియాశీల రాజకీయ జీవితంలో కాంగ్రెసు లోపల, బయట వుంటూ వచ్చాడు. అయితే, అతిసున్నిత మనస్తత్వం గల రంగా తన భావాల్లోనూ, చర్యలలోనూ పూర్తిగా కాంగ్రెసువాదిగానే వుంటూ వచ్చాడు. పచ్చని పైర్లతో కలకలలాడుతూ సువాసనలు వెదజల్లే ఆంధ్ర గ్రామీణ ప్రాంతాన్ని అంటిపెట్టుకొని వున్న రంగాకు రైతాంగ ప్రయోజనాలే ప్రధానమైనవిగా వుండేవి.

ప్రముఖ వ్యక్తులకు చావు వుండదు. ప్రజల దృష్టికి దూరమౌతారు అంతే! రంగా చనిపోయిన వార్త విని నాకు ఆ భావమే కలిగింది. రంగా ఒక విశిష్టమైన వ్యక్తి. ఆయన ఎక్కడున్నా అధిష్ఠాన స్థానానికి దూరంగా వుండేవాడు కాదు. ఆయన ప్రతిభకు గుర్తింపు వచ్చింది. మోతీలాల్ నెహ్రూ నాయకత్వంలోని స్వరాజ్య పార్టీలో చేరి, మూడవ దశాబ్దంలో కేంద్ర శాసన సభకు మొట్టమొదట సారిగా ఎన్నికయ్యాడు. ఆయన కీర్తి ప్రతిష్ఠలు యినుమడించాయి. ముఖ్యంగా భారతదేశ రైత బాంధవుడుగా పేరు ప్రఖ్యాతులు గడించాడు. నేను ఆయన్ను బాగా తెలుసుకోక ముందే ఆయన ప్రముఖ వ్యక్తిగా మారాడు. అందుకేనేమో, తన జీవితం చివరి రోజుల్లో ఆయన ప్రజల వుపేక్షాభావానికి లోనుగావడం నాకు అమితమైన బాధ కలిగించింది. ఇప్పుడు కూడా ఒక ప్రముఖవ్యక్తి జాతీయ రంగం నుండి నిష్క్రమించాడనే విషయం అధిక జనాభాకు తెలియలేదనే నేను గట్టిగా నమ్ముతున్నాను.

ప్రధాన మంత్రిగా వున్న చంద్రశేఖర్ మా యిద్దరినీ 'పద్మవిభూషణ్ ' బిరుదాంకితులను చేశాడు. ఆ బిరుద ప్రదానోత్సవ సభలోనే, అంటే 1991 మార్చిలో నేను ఆయన్ను ఆఖరిసారి కలిశాను. నేను ఆయన్ను భారతదేశంలో మొట్టమొదటిసారి చూచింది 1936లో. ఆ సంవత్సరం లక్నోలో జాతీయ కాంగ్రెసు మహాసభ జరిగింది. నేను కేవలం ప్రేక్షకునిగా దానికి హాజరయ్యాను. అదే సమయంలో అక్కడే మరువలేని అఖిల భారత కిసాన్ మహాసభలో మేమిద్దరం పాల్గొన్నాము. ఆయనకు సాహిత్యంపై మంచి అభిరుచి వుంది. అందువల్లనే ఆయన అఖిల భారత అభ్యుదయ రచయితల సమావేశానికి కూడా హాజరయ్యాడు. దానికి ప్రఖ్యాతి గాంచిన ప్రేమ్‌చంద్ అధ్యక్షత వహించాడు. సరోజినీనాయుడు, హస్రత్‌మోహాని, తదితర ప్రతిభావంతులు కూడా హాజరయ్యారు. నేను బెంగాల్ అభ్యుదయ రచయితల సంఘ ప్రతినిధిగా దానికి హాజరయ్యాను. అంతకు ముందు 18 నెలలపాటు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో పనిచేశాను. అప్పుడే నన్ను నిషిద్ధ కమ్యూనిష్టు పార్టీలో చేర్చుకొని, విద్యార్థుల సాంస్కృతిక కార్మిక సంఘాల పనిని అప్పజెప్పారు.

1936లో జరిగిన కిసాన్ సభ సమావేశంలో రంగాతోపాటు ముజఫర్ అహ్మద్, స్వామి సహజానంద, బంకిం ముఖర్జీ, ఇందూలాల్ యాజ్ఞిక్‌లను కూడా చూశాను. ఈ వ్యక్తుల పేర్లను నేను పేర్కొనడంలోని వుద్దేశ్యం ఏమంటే, ఆ సమావేశాన్ని గురించి ఆనాటి కమ్యూనిష్టు వుద్యమంలోని తన సహచరులగురించి కొన్ని సంవత్సరాల తర్వాత రంగా నాతో చెప్పాడు. దాన్నిబట్టి కమ్యూనిజం అంటే సోషల్ డెమాక్రాట్లకు సాధారణంగా వుండే ద్వేషం, అసహనం ఆయనలో మచ్చుకైనా లేదని తెలుసుకున్నాను. ఆయనది విశాల హృదయం. అలాంటి విశాల దృక్పథం వల్లనే రంగా ప్రముఖ సహజసిద్ధ పార్లమెంటేరియన్‌గా తీర్చిదిద్దబడ్డాడు. ఆయనకుండే భావాలు ఆయన కున్నాయి. అయితే తనకు పూర్తి వ్యతిరేక భావాలను గట్టిగానూ, అదే సమయంలో మర్యాద పూర్వకంగానూ ఎదుర్కొనేవాడు. దశాబ్దాలపాటు పార్లమెంటు సభ్యుడుగా తన ప్రతిభా శక్తులను ప్రదర్శించాడు. కొద్దిపాటి విరామం తప్పిస్తే దాదాపు 60 సంవత్సారలు ఏకధాటిగా (స్వాతంత్ర్యం ముందు, ఆ తర్వాత) కేంద్ర శాసన సభకు ఎన్నికైన ప్రజానాయకుడు.

1952 నుండి 1977 వరకు 25 సంవత్సరాలపాటు, పార్లమెంటులో నేనూ, రంగా మంచి స్నేహితులుగా వున్నాం. అయినా, అభిప్రాయాల్లోనూ, నడవడికలోనూ, జీవిత దృక్పథంలోనూ మా యిద్దరి మధ్య ఎంతో దూరముండేది. అయినప్పటికి మేమిద్దరం అతి సన్నిహితులమయ్యాం. 1952, ఆ తర్వాత కొన్ని సంవత్సరాలపాటు, కాంగ్రెసుపార్టీకి రంగా మూలాధారమైన వ్యక్తి. అయినా ఆయన కాంగ్రెసు పక్షపాతిగా వున్నట్లు ఎప్పుడూ ప్రజలకు అనిపించలేదు. సమర్థవంతమైన వాదనాపటిమ రంగా సొత్తు. అప్పుడప్పుడు మొరటుగా మాట్లాడినా, గౌరవ మర్యాదలను పొందడంలో ఆయన ఎప్పుడూ విఫలుడు కాలేదు. రాజకీయరంగంలో దీర్ఘకాల అనుభవమున్న రంగా పూర్తి నిజాయితీతో వుండేవాడు. ఆ నిజాయితీ పార్టీ విశ్వాస అవధులు కూడా దాటిపోతుంది. రంగా ఆక్స్‌ఫర్డ్‌లో చదివినప్పటికీ, రైతుకుండే నిరాడంబరత్వం ఆయన్ను వదలలేదు. ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూ పరిహాసం కోసం ఆయన్ను 'ఆచార్య'గా పిలిచినప్పుడు ఆయన లోలోన సంతోషించాడు. నెహ్రూ ఇచ్చిన 'ఆచార్య' బిరుదంలో వున్న వక్రోక్తిని రంగా ప్రతిఘటించ దలచుకోలేదు. పైపెచ్చు, కృపలానీకి వ్ను గౌరవప్రద 'ఆచార్య' బిరుదు తన కిచ్చినందుకు రంగా సంతోషపడ్డాడు.

కాంగ్రెసులో ఎక్కువకాలం వుండడం రంగాకు సాధ్యపడలేదు. కొండా వెంకటప్పయ్య, ప్రకాశంపంతులు లాంటి మహనీయులు కాంగ్రెసులో వున్నంతకాలం కాంగ్రెసు సజావుగా పయనించిందనీ, ఆ తర్వాత అధికారం కోసం పదవులకోసం మాత్రమే వచ్చే వ్యక్తులను ఆయన సహించలేక పోయాడనీ నాకనిపించింది. స్వతంత్ర పార్టీవైపు ఆయన మొగ్గు చూపడం

దురదృష్టకరమైన విషయం. 1961లో అనుకుంటా, ఆయన షష్టి పూర్తి వేడుకకు నేను హాజరయ్యాను. రంగాను అభినందిస్తూ, ఆయన సంప్రదాయాలకు కట్టుబడి వుండే వ్యక్తికాదనీ, రైతు జనోద్ధారకుడనీ ఒక పార్టీలో చాలా కాలం వుండేందుకు యిష్టపడని వ్యక్తి అనీ నేను మాట్లాడాను.

పార్లమెంటులో ఆయనప్పుడప్పుడు నిరుత్సాహంగా కనిపించేవాడు. ప్రధాన ప్రతి పక్ష నాయకుడైన రంగాను కాదని పార్టీ వుపనాయకుడైన మినూమసానీ తానే నాయకుడైనట్లు మెలిగేవాడు. అది రంగాకు మనస్తాపం కలిగించింది. అయినా అలాంటి సభ్యతలేని పద్ధతులను ఆయన అంతగా పట్టించుకునేవాడు కాదు. పార్లమెంటులో స్వతంత్ర పార్టీ విధానాలను గట్టిగా బలపరచేవాడు. అయితే, అందులో హుందాతనం, ఔచిత్యం కనిపించేవి. ఆయన ''నేటి తరహా'' రాజకీయవేత్త అయివున్నట్లయితే, ఆయన జీవితమే యింకొక విధంగా వుండేది. అధికారం ఆయన్ను వెదుక్కుంటూ వచ్చేది. ఆయన తరహాయే వేరు. తన విలక్షణమైన చర్యల్లో కూడా ఒక విధమైన 'నీతి' అంతర్లీనమై వుంటుంది. ఉదాహరణకు, ఆయన దౌత్య పరమైన విందులకు ఎప్పుడూ హాజరు కాలేదు. ఇతర పార్లమెంటు సభ్యుల మాదిరి కాకుండా, ఆయన పార్లమెంటుకు నడిచి వచ్చేవాడు. తిరిగి నడిచి వెళ్లేవాడు. ఎలాంటి ఆడంబరాలు లేకుండా నిజాయితీగా జీవించాడు. పార్టీలను మార్చినా, ఎన్నడూ ప్రతిఫలాన్ని వాంఛించ లేదు. అందుకోలేదు.

ఇందిరాగాంధీ విధానాలను, సూత్రాలను రంగా మాదిరి ఎవరూ అంతగా ప్రతిఘటించలేదు. అయితే, ఆమె ధైర్య సాహసాలను రంగా మెచ్చుకోలేకుండా వుండలేక పోయాడు. ఆ విషయమే నాతో చెప్పాడు. ఇందిరాగాంధీ అత్యవసర పరిస్థితి తర్వాత పరిస్థితిని, దానిని ఎదుర్కొని ఆమె బయటపడ్డ విధానాన్ని ఆయన ఎంతో పొగిడాడు.

రంగా నిష్కళంకమైన రాజకీయ నాయకుడు. రాజకీయాల్లో ఎన్నో సంవత్సరాలపాటు వున్నా ఆయనపై ఒక్క అపవాదుకూడా ఎరగం. ఆయన, ఆయన భార్య భారతీరంగా ఆదర్శ దంపతులు భారతీదేవికి నేను చేయెత్తి నమస్కరిస్తాను. ఈ రోజుల్లో అలాంటి ప్రముఖ రాజకీయ వ్యక్తిని గురించి చెప్పడం ఎంత గర్వకారణం!

మనలోని వృద్ధ నాయకులు ఒకరి తర్వాత ఒకరు అదృశ్యమైపోతున్నారు. మొరార్జీ దేశాయ్ నూరేళ్లు బ్రతుకుతాడనుకొన్నాం. ఆయన ఆ గడువును పూర్తి చేయకుండానే వెళ్లిపోయాడు గుల్జారీలాల్ నందా ఎక్కడో ఢిల్లీలోనో, హర్యానాలోనో కృశించి పోతూ వుండవచ్చు. అలాగే కర్నాటకలో నిజలింగప్ప. శీల భద్రయాజీ యింకా బ్రతికేవున్నాడు . ఆయన త్వరలోనే కనుమరుగు కావచ్చు. త్వరలోనే యిదివరకటి వయో వృద్ధ నాయకులు లేకుండా పోవచ్చు. అఖిల భారత కాంగ్రెసు కమిటీ మొదటి సభ్యుల్లో వున్న నేను యింకా బ్రతికేవున్నాను. నా వయస్సు యిప్పుడు 88 సంవత్సరాలు. ప్రజాసంఘటన కాలంలో నేను కమ్యూనిస్టునైనా, 1938లో సుభాష్‌చంద్రబోసు అధ్యక్షత వహించిన హరిపుర మహాసభలో నన్ను ఎ.ఐ.సి.సి సభ్యునిగా ఎన్నుకున్నారు.

రంగా ఆశాజీవి. నాకు మాత్రం జీవితంపై నిరాశ పెరిగింది. మనం పెంచి పోషించిన సాంఘిక నైతిక విలువలన్నీ అడుగంటి పోతున్నాయి. నాకు బాగా జ్ఞాపకం. 1989లోనో, 1991లోనో నేను రంగాతో షెల్లీని వుదహరిస్తూ 'పగలు, రాత్రులు సంతోషం ఎగిరిపోయింది. నా హృదయం దుఃఖంతో విలవిలలాడింది. ఆనందం కరిగిపోయింది' అంటూ నేను మరణాన్ని ఆహ్వానిస్తూ వున్నానని చెప్పాను. రంగా నన్ను మందలించాడు. మన జీవితకాలంలోనే మన కలలన్నీ నిజం కావాలని మనం గట్టిగా అనుకోవచ్చు. కాని చరిత్ర వొప్పుకోదు. ధైర్యంగా దృఢమైన ఆశయసాధనకోసం పనిచేయాలి, ఆశావాదం ప్రధానం. అది రంగాలో అధికంగా వుంది.

★ ప్రముఖ ఆంగ్ల దినపత్రిక ''ది హిందు'' సౌజన్యంతో

# తిట్టుకొక శృంగారమా?

- సత్తెనపల్లి రామమోహనరావు

''తిట్టుకొక శృంగారమా?'' అన్నారు. కోపంతో వొళ్ళు మండిపోతూ తిట్లపురాణానికి లంకించుకున్నప్పుడు అన్ని మర్యాదలూ వెనక్కి వెళ్ళిపోతాయి. ఎవరోకాని ఆగ్రహావేశాలతో ఊగిపోతూ కూడా నోరు సంబాళించుకొని మర్యాద హద్దులు దాటకుండా మాట్లాడలేరు. ఇహ మాపూటకూళ్ళమ్మ వంటివారి సంగతి గురించి చెప్పనే అక్కర్లేదు. ఆవిడ కనపడితే చాలు గిరీశం అంతటివాడు కూడాపుంజాలుతెంపుకొని పారిపోయేవాడు. ఆమె నోరు మహా చెడ్డది. ''నోరే కాదు, చెయ్యి కూడా చెడ్డదే. దాందెబ్బ నీకేం తెలుసు ? --'' అంటూ వీపు తడుముకునేవాడు రామప్పపంతులు పూటకూళ్ళమ్మ ప్రసక్తి వచ్చినప్పుడల్లా. ఆవిడచేత చీపురు దెబ్బలు ఘనంగా తిన్నవాడు కాబట్టే పూటకూళ్ళమ్మి చేతి దురుసుతనం గురించి మాబాగా తెలుసు పంతులుగారికి.

ఇలాంటి మోటు సరసాల సంగతి ఎలా వున్నా, మనని పొగుడుతున్నట్లు నటిస్తూనే నాజూగ్గా తిట్టిపోసేవాళ్ళు కూడా లేకపోలేదు. వెనకటి కవులు కొందరు అలాంటి వాళ్ళే. వెనకటి కాలందాకా ఎందుకుగాని మా పూజారి గవరయ్య అలాంటివాడే. ఆరోజు పంతులుగారు కమాను వెళ్ళారు. నాకేం, తోచలేదు. నేనేం మగనాల్ని కనకనా ఒకరికి భయపడటానికి? - పట్లిగ్గా నలుగుర్నీ పిలిచి పేకాడుకుంటూ కూర్చున్నాను. సిద్ధాంతి, పోలిశెట్టి, పూజారి గవరయ్యా అంతా వచ్చారు. పేకాటకంటె వాళ్ళ మాటలు, చేష్టలు నాకు బహు వినోదంగా తోచాయి. ఆమాటే అంటే పూజారి గవరయ్య మరీ పురెక్కిపోయాడు - ''పోలిశెట్టి మీద కవిత్వం చెప్పి చాలా కాలమయింది-'' అంటూ సావకాశంగా పొడుం పీల్చి కవిత్వం మొదలు పెట్టాడు. పోలిశెట్టివంక ఒకసారి చూసి - ''పోలిశెట్టి ముఖము పోలి రొట్టెను బోలు, పోలిశెట్టి ముక్కు పొడుము డొక్కు-'' అంటూ ఆశువుగా పద్యం చెబుతుంటే- నిజం చెప్పొద్దూ- నాకు నవ్వాగలేదు. పమిటచెంగు అడ్డుపెట్టుకొని ఫక్కుమన్నాను. కాని పోలిశెట్టే లబలబలాడి పోయాడు - ''వొద్దు వొద్దు... నా మాటిను. సాపంపెట్టి సంపేస్తావాయేటి...'' అంటూ గోలపెట్టాడు.

పద్యంలో శాపంపెట్టి సంపేస్తావా ఏమిటి - అని పోలిశెట్టి అనేసరికి నామనసు గతంలోకి మళ్ళింది. వెనకటి తిట్టుకవులు వారి ధార్ష్ట్యం జ్ఞాపకం వచ్చింది. పెడితే పెళ్ళి, లేకపోతే తద్దినం అన్న తీరుగా తాము అడిగినవి యివ్వనివారిని, తమకు నచ్చని పనులు చేసినవారినీ సలక్షణంగా ఛందోబద్ధంగా తిట్టిపోసిన కవులు వెనక చాలామంది వున్నారు. అలాంటి పద్యాలలో ఎన్నో మంచి ప్రాచుర్యాన్ని కూడా పొందాయి.

మొదటి పాదంలో ''అ,క,చ,ట,హ'' అక్షరాలను మూడవ స్థానంలో వుంచి పద్యం అల్లితే కీడు జరుగుతుందిట. అందుకే ఆ అక్షరాలను వుండకూడని చోటులో వుంచి పద్యాలు చెప్పి తమ విరోధులకు కీడు తలపెట్టిన కవులున్నారు. ఇహ ఆరవస్థానంలో 'త' అక్షరాన్ని వుంచి పద్యం చెబితే మరణమే సంభవించేదిట. ''ఆరవేకడ 'తా' నిల్పిన మారమ్మున గ్రుమ్మునట్లు మడియు మనుజుడున్-'' అని లక్షణ గ్రంథంలోనే చెప్పారు. అందరూ అలా చేయకపోయినా వేములవాడ భీమకవి ఒకసారి అలాగే చేసి సాగి పోతరాజు అనే ఆసామి మరణానికి కారణమయాడు. ఓసారి యీకవిగారు గుడిమెట్ట అనే గ్రామానికి గుర్రం ఎక్కి వెళ్ళాడుట - మా రామప్పపంతులు గుర్రమెక్కి కమాను వెళ్ళినట్లు. ఊరు చేరిన తర్వాత గుర్రం దిగి, గుర్రాన్ని ఊరివాళ్ల చేలల్లోపడి మేయమని వదలి తనే కవితాగోష్ఠిలోనో పాల్గొనటానికి వెళ్ళాడు. యజమానికి తగిన ఆ గుర్రం

పోతరాజు అనే ఆసామి పొలంలో పడి మేయటం మొదలు పెట్టింది. పోతరాజు ఆ గుర్రాన్ని పట్టి బందిల దొడ్డిలో పెట్టించాడు. అంతే! భీమకవిగారికి అగ్నిహోత్రావధాన్లు మామగారికి వచ్చేటంత కోపమూ వచ్చింది. ''కోపం వస్తే మీ నాన్న అగ్గిరావుడోయ్-'' అని గిరీశంగారు వెంకటేశంతో అన్నట్లుగా యీ కవిగారు కూడా అగ్గిరాముడైపోయారు. వెంటనే ఆరవస్థానంలో తకారాన్ని వుంచి పోతరాజు మీద పద్యం అల్లేశాడు. ''హయ మది సీ 'త '. పోతవసుధాధిపు డారయ రావణుండు నిశ్చయముగ నేను రాఘవుడ సహ్యజ వారధి-'' అంటూ మొదలుపెట్టి యింకేవేవో చెప్పి - ''యీ గుడిమెట్టలంక నా జయమును బోతరక్కసుని చావును నేడవవాడు చూడుడీ '' అని తిట్టు పద్యం పూర్తిచేశాడు. కవివాక్కు అమోఘమై పద్యం సత్యమై అన్నట్లే పోతరాజు వారం తిరక్కుండానే మరణించాడుట. అయితే కవుల కోపం తాటాకు మంటలాంటిది కావటంతో కోపం తగ్గి చల్లబడిన తర్వాత శాపానుగ్రహ సమర్థుడయిన భీమకవి మరో పద్యం చదివి పోతరాజును బ్రతికించాడు. ఈ యిద్దరికీ ఏ జన్మవిరోధం వుందోకాని యిలా భీమకవి రెండుమూడుసార్లు కవిత్వం అల్లి పోతరాజును చంపటం, మళ్ళీ కొత్త పద్యాలు చెప్పి బతికించటం జరిగింది. రాంభొట్లగారి అచ్చమ్మ అన్నట్లు - ''నీ వెర్రికాని మంత్రాలకు చింతకాయలు రాలుతాయిటే.. పద్యాలకు మనుషులు చస్తారా ఎక్కడన్నా-'' అంటే నేనేం చెప్పలేను. మళ్ళీ ఆ సంగతేదో గిరీశంగార్ని అడిగి తెలుసుకోవాల్సిందే. అలా అడుగుదామన్నా గిరీశం అయిపూ అజా లేడే! బుచ్చెమ్మ వదినను లేవదీసుకుపోయిన తర్వాత మళ్ళీ ఆయన భోగట్టాయే తెలియలేదు. ''రవంత ఆచూకి తెలిసింది కాదు. దొంగ వెధవని చంపేసి పోదును. గాడిద కొడుకును అమాంతం పాతిపెట్టేద్దును-'' అంటూ అగ్నిహోత్రావధాన్లు మాంవగారు చిందులేస్తూ తిరుగుతున్నార్ట. ఆయన్తోపాటు మనమూ గంతులేస్తూ తిరిగితే గిరీశంగారు ఎక్కడన్నా తగలొచ్చు. అంత ఓపికా తీరికా యిప్పుడు నాకెక్కడివి? - నేను క్షణం కనపడకపోతే మాపంతులుగారు గుర్రమెక్కి మరీ ఊళ్ళన్నీ వెతుకుతాడు. సిద్ధాంతి పోలిశెట్టి, గవరయ్యా అంతా తలోదిక్కుకూ పరిగెత్తుతారు. నేను లేకపోయేసరికి అసలు రామచంద్రపురం అగ్రహారమే చిన్నపోయిందని కరటకశాస్త్రులు కవిత్వా లల్లుతాడు. అందుకే యీ గొడవలన్నీ ఎందుకని ఊరుకున్నాను. అయినా నిజంగా చచ్చిపోయినా పోకపోయినా ఛందోబద్ధంగా అన్ని తిట్లు శుద్ధగ్రాంధికంలో తిడుతూవుంటే వాళ్ళు చచ్చిపోయినట్లే వుండదూ?

రసవంతమైన కవిత్వం చెప్పటంలో పేరు గడించిన భట్టుమూర్తి కూడా కోపం మరీ ఎక్కువగా వచ్చినప్పుడు - ''దిట్టక మాన నామతము తీవ్ర మహోగ్ర భయంకరంబుగా-'' అంటూ తిట్లపద్యాలు గుమ్మరించేసే వాడుట. ఆనాటి కవుల తిట్లంటే మనుషులే కాదు, చెట్లూ, చెరువులూ కూడా భయపడి పోయేవి. మేధావి భట్టు అనే ఆయనకి హటాత్తుగా మూడ్ వచ్చి పద్యం రాయాలనుకున్నాడు. కాని చేతిలో గంటం వుంది కాని తాటాకు లేదు. ఎదురుగుండా ఒక తాటిచెట్టు కనపడితే - ''కవి వరుడు ఫీడె వచ్చు పద్యము వ్రాయన్, గేలను లేదా కొకటియు దాళమ తుత్తునియలగుచు ధరపై బడుమా-'' అన్నాట్ట. అంతే, అంతటి పెద్ద తాడిచెట్టూ ఆలస్యం చేస్తే యింకెన్ని తిట్టుపద్యాలు వినవలసి వస్తుందోనని గడగడలాడుతూ పెళపెళమంటూ కూలిపోయింది. చెట్టును పడగొట్టి సేకరించిన తాటాకులమీద భట్టుగారు తిట్టు పద్యాలే రాశారో మంచి పద్యాలే రాశారో నాకైతే తెలియదు.

ఆడవాళ్ళు కూడా అలిగినప్పుడూ, అనుకున్నది జరగనప్పుడూ తిట్టిపోస్తూనే వుంటారు. ''నీ జిమ్మడ, నీ దీపమారా'' లాంటి తిట్లు పల్లెల్లోని ఆడంగులు వల్లెవేయటం నేను చాలాసార్లు విన్నాను. కాస్త నాజూకు తెలిసి, కొంచెం చదువుకూడా సాగించిన నవలామణులు - నీ తాడు తెగిపోను, నీ నోరు పడిపోను - లాగే తిట్టిపోసినా అవి కాస్త నాజూకు బాణీలో వుంటాయి. అమ్మాయి వలచిన అందగాడింకా రాలేదు. కాని వెన్నెలొచ్చేసింది. విరహం ముంచుకొచ్చింది. ఇహ

తాళలేకపోయింది. మన్మథుణ్ణి తిట్టిపోయటం మొదలుపెట్టింది - ''నీ బాణంబులు రాల, నీ ధనువు ఖండీభూతమై పోవ, నిన్ఫణియంట, నీ బలములాశా వీథిపాలైచన...'' అంటూ చెరిగిపోస్తుంటే అనంగుడికి కూడా వొళ్ళు తూట్లు పడినట్లే అయిపోదా ఏమిటి? - పెద్దనగారి వరూథిని కూడా ప్రవరుడు రాకపోయినా చంద్రుడు వచ్చినందుకు పాపమా చందమామను పట్టుకొని తిట్టిపోస్తుంది. ''త్రిపుర సంహార మొనరించునపుడు హరుడు / బండి కల్లుగ నీమేను గండి చేసె నదియు సెలవారి తెగటార్వతై చంద్ర-'' అంటూ తిడుతుంది. కావ్యనాయికలకు విరహం శృతిమించి నప్పుడు చంద్రుణ్ణి, వెన్నెలను, మన్మథుణ్ణీ మలయమారుతాన్ని తిట్టిపోయటం మామూలే. ఇక్కడే ఆడవాళ్ళకీ మగవాళ్ళకీ తేడా వుంది. బుచ్చెమ్మను చూసి ఎంతగా విరహంలో మునిగిపోయినా గిరీశంగారు ఎవర్నీ తిట్టలేదు. ''కాముని విరిశరముల బారికి నెటులోర్తునె, చెలియ నేనెటులోర్తునె-'' అంటూ ఏదో తనగోడు వెళ్ళబోసుకున్నాడు తప్ప - చంద్రుణ్ణీ చల్లగాలినీ దూషించలేదు.

అగ్నిహోత్రావధాన్లు మామగారికి కోపంవస్తే - ''నీ శ్రాద్ధం చెట్టుకింద పెట్టా, నీ పిండం పిల్లులకు పెట్టా-'' అని తిట్టిపోసేవాడు. అలా తిట్టినప్పుడల్లా - ''చెట్టు కిందో, చెరువు గట్టునో అసలంటూ పెడతారు కదా... శ్రాద్ధఫలం మీకు దక్కుతుంది లెండి-'' అని కొక్కిరించేవాడు గిరీశం. ఒకసారి ఎవరో స్నేహితుడుట గిరీశంగారికి - పట్నంనుంచి వచ్చాడు. వచ్చిన దగ్గరనుంచీ ఒకటే లెక్చర్లు. వినీ వినీ అందరికీ చెవులు తడికలు కట్టిపోయాయి. అగ్నిహోత్రావధాన్లుగారిహ సహించలేకపోయారు-'' నీ పిండం పిల్లులకు పెట్టా.. ఒకటే సోదటయ్యా...'' అంటూ విసుక్కున్నాడు, మొహమాటం లేకుండా. దానికా గడుగ్గాయి - ''చిత్తం... అలాగే చేయించండి. కాకులకు పెడితే ఏమిటి?. పిల్లులకు పెడితే ఏమిటి? సృష్టిలో అన్ని జీవులూ సమానమే కదుటండీ-'' అన్నాడు. ఇలాంటి మొండివాళ్ళ కోసం కొత్త తిట్లు వెతుక్కోవాల్సిందే కాదూ?

అలా వెతుక్కునే - ''ఛీ ఛీ ఒరే పాతకా ఘాతుకా దుర్నీత ఉచ్ఛిష్టపున్ రోత ఇదె చూడరా ధాత నీవ్రాత నాచేత రాయించెరా దుర్బీజమా నైజమా సాజమా ఏరా హరమా గులామా-'' అంటూ ఏకంగా ఓ పెద్ద తిట్ల దండకమే రాశారు మరో కవిగారు. ఇన్ని తిట్లు ఎక్కడనేర్చుకున్నాడో ఆయనకే తెలియాలి. ఒకోసారి మనం తిట్టిన తిట్లు అడ్రస్ సరిగా రాయని ఉత్తరాల్లాగా మనకే తిరిగొచ్చి తగుల్తాయి. ఓసారి ఓ పెద్దాయనకు మరో చిన్నాయన మీద కోపం ఉధృతంగా ముంచుకువచ్చి - ''గాడిద కొడకా...'' అని తిట్టాడు. దానికా చిన్నాయన ఎంతో వినమ్రంగా - ''చిత్తం... తమరు తండ్రులు మేం బిడ్డల్లాంటి వాళ్ళం. తమరు అనదగ్గ వాళ్ళు; మేం పడవలసిన వాళ్ళం-'' అంటూ అతివినయం వొలకపోశాడు. ఇంతకు యిలాంటి సందర్భాలలో ఎవర్ని ఎవరు తిట్టినట్లంటారు?

ఇన్ని శషభిషలు లేకుండా వుంటేనే కదా తిట్లయినా, దీవెనలయినా చప్పున అర్థం అయేది. అలా అర్థం అయేట్లు సూటిగా మాట్లాడటం ఆడవారికే చేతనవుతుంది అంటాన్నేను. ఒంటరిగా కనపడ్డ అమ్మాయిలతో వరసావావీ లేకుండా సరసాలాడే గ్రంథసాంగులను పట్టుకొని - ''వరసగానీ వారిని వరసాడబోతే పురుషుడా నీ శిరసు ధరణికొరగెను, కాని వారిని నీవు కారాడబోతే కాముడా నీ శిరసు కాటికొరగేను-'' అంటూ ఓ పల్లెపడుచు పదం పాడుతూ కదం తొక్కిందట. భూషణకయినా దూషణకయినా అలాంటి స్పష్టత అవసరమే కాదూ?

అగ్నిహోత్రావధాన్లు మావగారికి కోపం వస్తే అవతలివాడు ఎంతటివాడయిందీ పట్టించుకోడు. ఆయనకి తెలిసిందల్లా తిట్టిపోయడమే. ''నీ యింట కోడి కాల్చా...'' అనేది ఆయన దృష్టిలో ఒక తిట్టు. వకీలు నాయుడుగారు - ''ఇంగ్లీషు వకీలు సరదా తీరిందా? ఫోర్జరీకి తమక్కూడా మత ప్రవేశం అవుతుంది-'' అనేసరికి అగ్నిహోత్రావధాన్లు మండిపోయి - ''నీ యింటకోడి కాల్చా-'' అంటాడు. దానికి నాయుడు -''అమోఘాశీర్వచనం, రోజూ కాలుస్తూనే వుంటారు-'' అంటాడు. నిజమే మరి - నాయుడిగార్కి - ''నీయింట తోటకూరపులుసు వండా...'' అంటేతిట్టులా వినిపించొచ్చు కాని - ''నీ యింట కోడికూర వండా-'' అంటేతిట్టెలా అవుతుంది చెప్పండి? 'తిట్టుకొక శృంగారమా' అన్నారు కాని తిట్టుకీ పెద్దపురాణమే వుంది తీరిగ్గా చెప్పుకోవాలిగాని - ఏమంటారు?

# కావ్యజగత్తు

- జి.వి. కృష్ణరావు

కిం కవే స్తస్య కావ్యేన కిం కాండేన ధనుష్మతః,

పరస్య హృదయే లగ్నం న ఘూర్ణయతి యచ్ఛిరః.

కావ్యజగత్తు నిత్యనూతనం, నిత్యసుందరం; ఎప్పటి కప్పు డపూర్వం. మనీషకు అందినట్లుంటుంది కాని అందదు. హృదయానికి తగులుతూ వుంటుంది. బుద్ధికి చిక్కదు; తప్పించుకుపోతూనే వుంటుంది. ఇలాంటి కావ్యజగత్తుకి కొందరు అలంకారము ఏలిక అన్నారు; కొందరు రీతి అన్నారు; కొందరు గుణమన్నారు; కొందరు రసమన్నారు; కొందరు ధ్వని అన్నారు; కొందరు వక్రోక్తి అన్నారు; కొందరు భక్తి అన్నారు; కొందరు 'స్వచ్ఛందభావాలూ', అద్భుతమూ నన్నారు. ఎవ్వరేమి చెప్పినా ఆనందం ఏలి కంటే ఎవరికీ అభ్యంతర ముండదనుకుంటాను.

అయితే కావ్యజగత్తులోని ఆనందం సమాజంలో సర్వసాధారణంగా యథాతథంగా కనిపించకపోవటం వల్ల విస్తుపోవటం సంభవిస్తూ వుంది. సంస్కృతాన్నుంచి అపభ్రంశాలు బయలు దేరినట్లుగానే, కావ్యజగత్తునుంచి అపభ్రంశ రూపంగా సామాజికజగత్తు వచ్చిం దని కొంద రభిప్రాయపడుతున్నారు. ఈ మతం ప్రకారం కావ్యజగత్తు సత్యం - సామాజిక జగత్తు మిథ్య. కాని యీ మతం కేవలం భ్రమపూర్వకమైన దనటంలో సాహసం ఏమాత్రం లేదు. కావ్య జగత్తువల్ల కలుగుతున్న ఆనందం వల్ల వివశులై జ్ఞానాన్ని విసర్జిస్తున్నారు. కాని ఆధునిక శాస్త్రాలు పరిశోధించి కనుగొన్న విషయాలను అవగతం చేసికోవడం లేదు. ఒకవేళ చేసికొంటే, విస్మరిస్తున్నారు. కావ్య జగత్తుకి శాస్త్రాలు సంపూర్ణ వ్యాఖ్యానం వ్రాయలేకపోవచ్చును. అంతమాత్రంచేతనే యీ కావ్యజగత్తు సామాజిక జగత్తు కతీతమైనదనికాని, కావ్యజగత్తులోనుంచి సామాజిక జగత్తు వచ్చిందనికాని చెప్పటం కేవలం మూఢత్వమేనని చెప్పాలి. సామాజిక జగత్తునుంచి కావ్యజగత్తు వచ్చింది. అయితే యిలా వచ్చిన కావ్యజగత్తు సామాజిక జగత్తును స్వల్పంగా మార్చివచ్చును. ఈ విషయం ఎలా తేలిం దన్న ప్రశ్న వస్తుంది.

కావ్యం శబ్దాలతో నిర్మింప బడుతుంది. సాంకేతికవాదుల్లో అతివాదులు నాదంతో నిర్మింపబడుతుంది అంటారు. వీరికి శబ్దగత అర్థం ప్రధానం కాదు; శబ్దగతనాదం ముఖ్యం. ఈ వాదాన్ని అంగీకరించటానికి వీల్లేదు. ఆదరించేపక్షంలో కవిత్వానికీ, సంగీతానికీ భేదమే ఉండదు. అందువల్ల కావ్య జగత్తు శబ్దాలతో నిర్మింపబడుతుంది. అందుకనే జగన్నాథ పండితుడు కవిత్వాన్ని 'రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః' అని నిర్వచించాడు.

అయితే యీశబ్దం సంగ తేమిటి? ఈ శబ్దం లౌకికమా, అలౌకికమా? ఈ శబ్దం ఎలా వస్తున్నది? శబ్దం ఏమి చేయగలుగుతున్నది? ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పుకుంటే మనకు ప్రస్తుతమైన విషయం కొంతవరకు తేలుతుంది.

శబ్దం అర్థవంతం. శబ్దానికి అర్థమంటే ఏమిటి అని ప్రశ్నించి ఇతరులను కలవరపరచటం, తమకుతాము కలవరపడటం జరుగుతున్నది. మనస్సులో శబ్దంవల్ల ఏది గోచరిస్తుందో దాన్ని అర్థమందాము. అయితే ఆ శబ్దానికి ఈశక్తి ఎలావచ్చింది? ఈ శక్తి శబ్దంలోనే వుందా? ఈవిషయం తేల్చుకోవాలంటే పెద్ద రగడలోకి దిగవలసి వస్తుంది. పదిరూపాయల నోటుకున్న శక్తి ఎక్కడి నుండి వచ్చింది అనిప్రశ్నిస్తే, ఆర్థిక శాస్త్రమంతా అవలోడించి చెప్పవలసిన స్థితి ఏర్పడుతుంది.

తర్కించిన తరువాత పదిరూపాయల నోటువిలువ కేవలం సమాజంలోని మారకాన్ని పట్టి ఏర్పడుతున్నట్లు తేలుతుంది. ఇలాగే శబ్దానికి అర్థం లోక వ్యవహారం వల్ల ఏర్పడుతున్నది. అందుకనే శబ్దశాసనుడు ''సిద్ధిర్లోకా ద్ద్రుశ్యా లోకో ఉ నన్యాదృశశ్చ నిత్యశ్చ,'' అన్నాడు.

శబ్దం జాతి గుణ ద్రవ్య క్రియాచ్ఛాయలకు సంకేతం. ఇంతటితోనే శబ్దం పని అయిపోదు. సమాజంలో ఈ జాతిగుణ ద్రవ్య క్రియలవల్ల మానవుడికి సాధారణంగా పొడమే వేదనలకు కూడ సంకేతం; అంటే యీ మనో వికృతులను కలిగిస్తుంది. స్నేహితునితో మాట్లాడుతూ 'పాము' 'పాము' అంటామనుకోండి. అతడు ఉలిక్కిపడతాడు. ఎందువల్ల? 'పాము' అనే శబ్దం విన్న వాని మనసులో అణగివున్న విషజాతిప్రాణి రూపచ్ఛాయను తెచ్చిపెట్టింది. అంతేకాక లోకంలో పాము అనేదాన్ని చూస్తే ఏ వేదనలు కలుగుతాయో వాటిని కలిగించింది. అందువల్ల శబ్దానికి ప్రత్యక్షాంశాలను, వేదనలను కలిగించే శక్తి ఉంది. అయితే శబ్దాన్నుంచి యీ ప్రత్యక్షాంశ వేదనల రెంటిలో ఏ ఒకదానినీ విడదీయటానికి వీల్లేదు. ఈ రెంటికీ, శబ్దానికీ అవినాభావ సంబంధ ముంది. అంతేకాని ప్రత్యక్షాంశాలను సూచించటానికి ఒక శబ్దం, ఆ ప్రత్యక్షాంశంవల్ల కలిగే వేదనలను కలిగించటానికి వేరొక శబ్దం ఎందుకు సృష్టించుకోగూడదు అనే ప్రశ్న వస్తుంది. జీవితంలో ఒక వస్తువు, ఆ వస్తువువల్ల కలిగేవేదన కలసి ఉంటున్నట్లే శబ్దంలో ప్రత్యక్షాంశసంకేతం, దీనివల్ల కలిగే వేదన కలసి ఉంటున్నాయి. వేదనలను దెలిపే భీతి, దుఃఖంలాంటి శబ్దా లున్నాయి. అయితే యీ రెండు శబ్దాలూ దృశ్యములైన అవస్థలను, ఈ అవస్థలను చూచినట్లైతే కలిగే వేదనలను కలిగిస్తున్నాయికాని, నిజంగా వినేవాడిలోకాని, చెప్పేవాడిలోకాని, చదివేవాడిలోకాని భీతిని, దుఃఖాన్ని కలిగించటం లేదు.

శబ్దం నాదరూపకం. అందువల్ల అర్థంకంటే భిన్నమైనశక్తి కూడ ఒకటి ఉంది. ఈశక్తి ఒక్క పద్య కవిత్వంలోనే కనిపిస్తుంది. ఇది "Break, Break" అనే టెన్నిసన్ పద్యంలోనూ, 'పో' వ్రాసిన The Bells అనే శీర్షిక గల పద్యాల్లోను, తిక్కన పద్యాల్లోను, గీతగోవిందంలోను చక్కగా కనిపిస్తుంది. ఇప్పటి సర్రియలిష్టులు, అంటే అతి వాస్తవికులు తమవచనంలోకూడ ఈ నాదశక్తిని వాడుతున్నారు. ఈనాదశక్తి కూడ లౌకికమేనని శాస్త్రాలు పరిశోధించి చెబుతున్నాయి.

ఇవిగాక మన ఆలంకారికులు-ముఖ్యంగా అభినవగుప్తాదులు, రసచర్చల్లో వివక్షించిన విలక్షణజ్ఞానం, అంటే సమ్యక్ప్రతీతి, మిథ్యాప్రతీతి, సంశయప్రతీతి, సాదృశ్యప్రతీతికంటే విలక్షణమైన జ్ఞానంకూడ శబ్దంవల్ల కలిగేదే.

ఇంతకూ శబ్దం సమాజసిద్ధమనీ, ప్రత్యక్షాంశాలను, వేదనలను తెలుపుతుందనీ, కలిగిస్తుందనీ తేల్చుకున్నాం. అయితే సామాజిక జగత్తు అనంతంగా ఉందికదా, శబ్దాలు ఇలాంటి ప్రత్యక్షాంశాలన్నిటినీ చెప్పగలవా అన్న ప్రశ్న రావచ్చును. సమాజంచేత సృష్టింపబడిన శబ్దం కూడ మారుతుంది. కొన్ని శబ్దాలు పోతాయి. కొన్ని కొత్త శబ్దాలు వస్తాయి. కొన్ని శబ్దాల అర్థం మారుతుంది. స్ఫోటవాదం శబ్దం నశించదని చెబుతూ వుంది. దీన్ని సమర్థించటానికి వీల్లేదు. తెలుగుభాషలో ఎన్ని శబ్దాలు నశించలేదు. ఒకవేళ నశించకుండా ఏశాసనంలోనో, ఏమూలనో, ఎచ్చటనో నిల్చి ఉన్నాయని అనుకుందాము. ఉంటే? ఆంధ్రరాజుల నాణాలుఒకటీ అరా ఉన్నాయి. మారకం లేనప్పుడు ప్రయోజన మేముంది?

అయితే ప్రపంచంలో ఎన్ని వస్తువులున్నాయో అన్ని శబ్దాలు లేనిమాట వాస్తవం. అంతమాత్రంచేతనే శబ్దవ్యాపారం నియతమని చెప్పటానికి వీల్లేదు. విశ్వనాథుడు చెప్పినట్లు శబ్దశక్తి అనంతంగా ఉంది.

యాబర్ క్రోంబీ అనే ఆంగ్లేయవిమర్శకుడు శబ్దశక్తి నియతమనీ, భావాలు అనంతంగా ఉంటాయనీ, కాబట్టి వీటినన్నిటిని వ్యక్తం చేయటానికి కవికి సాధ్యపడదనీ, అందువల్ల పాఠకుడు సానుభూతి కలిగి ఊహించుకోవాలనీ అంటాడు. శబ్దశక్తి నియతమవ్వటంవల్ల కవి చిక్కున పడటంలేదు. ఇతర భాషా శబ్దాల్లోనో 'రిథిమ్'లోనో భావించటంవల్ల భావప్రకటన సాధ్యం కావటం లేదు. కవియైనవాడు సామాజిక శబ్దాలతో ఆలోచించాలి. అలాకాక రాగాలతోను రేఖలతోను, వర్ణాలతోను భావిస్తే ప్రయోజన మేముంటుంది?

కాబట్టి శబ్దం సమాజసిద్ధమనీ, మారుతూవున్న సామాజిక జగత్తులోని ప్రత్యక్షాంశాలను, వేదనలను తెలుపుతుందనీ తేల్చుకొన్నాం.

ఇలాంటి శబ్దాలతో నిర్మింపబడే కావ్యజగత్తు అలౌకికమెట్లవుతుంది?

అయితే, పురాణాలు, ఇతిహాసాలు, బ్లాబర్డ్, ఏన్షియంట్ మారినర్ చిత్రించిన విషయాలు సామాజిక జగత్తునకు సంబంధించినవేనా?

''కౌదలఁ జదలేటి లేఁ దరగలు బాలుఁ
డగు చందమామ యుయ్యాల లూఁపఁ
దొడవుల తలలఁ జెన్నడరు మానికముల
చాయ దిక్కుల నెఱసంజ వఱుపఁ
దోరంపుటేనిక తోలియెద్దెఱకప్పు
కుత్తుకతోఁ బ్రీతి పొత్తుసేయ
దట్టంపుబూదిపూఁతల బూదిసఱచిన
పునుకలు పేరురంబునఁ దలిర్ప

మూఁడులోకంబులను గావ మొనసినట్లు
చేత ముమ్మొనక్రైదువు చెన్నుమీఱ
వేల్పుపదువు చూడ్కికి గడువింతయొప్పు
సేసె ముక్కంటియున్న యా చెలువుపేర్మి.''

''తొలుకారు మెఱుఁగుల తోఁటలో నాడెడు
రాయంచ కొదమతో రాయఁజాలి
యిరులబండారంపు టింటికిఁ బెట్టిన
బొండుమల్లెలకోటఁ బోరగెలిచి
బలుమంచుఁ గంబాల బలసిరాఁ జుట్టిన
క్రొత్తమంజిడి బాగుఁ గొఱతచేసి
పాలపెన్నురువు గుబ్బలిమీఁద నెలకొన్న
నిండు వెన్నెల ముగ్గు నిగ్గు చెఱిచి

జడలఁ గ్రొన్నెల మెడఁ బాఁపఁసరిగఁ దొడల
బొడలతోల్మైన వెలిమిడిపూఁత మించఁ
బొడమి వ్రేఁటేని ముందటఁ బొడవుసూపె
పొడవులందెల్లఁ బొడువైన బోఁటివేల్పు.''

అనీ,

అనీ మనోహరంగా వర్ణింపబడిన శివుడు లౌకిక సృష్టికి లోనైనవాడేనా? కవిభావన దైవప్రేరణవల్ల లోకాన్ని అతిక్రమించి పోతుందని చాలామంది అభిప్రాయం.

ఇలాంటి అభిప్రాయం ఆధునికశాస్త్రాలు కష్టపడి పరిశోధించి కనుగొన్న సత్యాలను గుర్తించలేదని తెలుపుతుంది. ముఖ్యంగా మానసిక వైద్యశాస్త్రం వృద్ధిచెంది ఈభావనా విషయంలో చాల సత్యాలను కనుగొన్నది. ఈకనుగొన్న సత్యాలను వినియోగించి మానసికవైద్యం వ్యాధులను నివారిస్తున్నది. ముఖ్యంగా చార్కొట్, జానెట్, మోర్టన్‌ప్రిన్సు, ఫ్రాయిడ్, ఇతని శిష్యులైన జంగ్, ఎడ్లర్ సిద్ధాంతాలు చాలా సమస్యల్ని పరిష్కరిస్తున్నాయి.

కవుల వర్ణన ప్రకారం శివుడు అలౌకికమూర్తి; కవులు ఎలా సృష్టించ గలిగారా అనే సందేహం ఒకప్పుడు నన్ను పీడిస్తూ వుండేది. కాని సైకోయెనలిస్టులు బండారం బయట పెట్టారు. ప్రస్తుతం శివుడు అలౌకికుడు కాదనీ, వ్యాసుడు వాసనలను ప్రకృతిసిద్ధ మార్గాలను పోనీక సంయమించటంవల్ల ఈసృష్టి బయలుదేరిందనీ, శివుని ఆకృతి అలౌకికంకాదనీ, కేవలం పుంస్త్వస్వరూపమేననీ గ్రహిస్తేచాలు. ఏన్షియంట్ మారినర్ ఎలా సామాజిక జగత్తు నుంచి భాహిరిల్లిందో రీడ్ వగైరాల విమర్శలను చదివితే తెలుస్తుంది.

భావాల తత్త్వాన్ని గూర్చి కూడ కొంత తెలుసుకొందాము. నిజానికి భావాలు జాగ్రదవస్థలో కంటే స్వప్నావస్థలో విపరీతంగా పరుగిడుతుంటాయి. సామాజిక జగత్తుతో ఏ సంబంధంలేనట్లు కనిపిస్తాయి. ఇలా కనిపించటం వల్లనే స్వప్నం దైవప్రేరితమనీ, కాబోయే అర్థాన్ని సూచిస్తుందనీ, దుస్స్వప్నాలకు శాంతి చేయించుకోవాలనీ అనేవాళ్ళు కూడ ఉన్నారు.

సంపాదకుని దృష్టిలో

# చిత్రకారుని దృష్టిలో పురస్కారం



BARE FOOT DOCTOR



మిసిమి 1995

## గతం – స్వగతం

మానవునిచే శోధించబడిన శాస్త్ర విజ్ఞానపు నూతన పోకడలు, మానవుడినే ఎలా గులాం చేసికొన్నాయో? **1947**లో ప్రవృత్తి రీత్యా పత్రికారంగంలో ప్రవేశించిన నాకు, ''మిసిమి''కి గల సంబంధం అదే తరహాలో మొదలయి, ఆమె సందేహాలను శేష ప్రశ్నలను సమాధానపరచలేని అశక్తుడనని వొప్పేసుకుని రచయితల కాటకం, జనరేషన్ గ్యాప్ అని సమర్థించుకొని, రాజీపడి, నాటు డాక్టరుగా పట్టాపొందాను. కాని నా జీవితంలో గర్వించదగినది, గుర్తించుకోదగినది, చివరకు మిగిలేది ''మిసిమి''మాత్రమే.



జ్యోతి 1947

# మిసిమి

## మల్లె పూదండ

## మహా నగర్

### బంగారానికి పరిమళం

హుసేన్ సాగరంలో ఒక కలువ పువ్వు కనిపిస్తే ఎలా వుంటుంది? గంజాయి వనంలో ఒక తులసి మొక్కగానీ కనిపిస్తే అప్పుడు ఎలా ఉంటుంది ? కాకుల గోలమధ్య ఒక కోయిల పాటగానీ వినిపించితే ఎలా వుంటుంది? తెలుగు వ్యాపార, వ్యవహార పత్రికల మధ్య 'మిసిమి' అనే బంగారు పత్రికను చూచినప్పుడు ఖచ్చితంగా అలాగే వుంటుంది. పాఠకులు కొని చదువుకునే పత్రికలకూ, చదువుకున్న వారు చదువుకునే పత్రికకూ వున్న తేడా తెలిస్తే 'మిసిమి' విశిష్టత అర్థం అవుతుంది.

పాఠకులకు ఎలాంటి సరకు కావాలి, పత్రిక సర్క్యులేషన్ ఏ రీతిగా పెంచుకోవాడానికి ఎలాంటి తమాషాలూ, చక్కిలి గింతలూ, అంగాంగ వర్ణనలూ కావాలి, చౌకబారు అభిరుచికి ఎలాంటి షడ్రసోపేతమైన విందు వడ్డించాలి, అని మిగిలిన తెలుగు పత్రికలన్నీ పోటీపడుతున్న వేళ, నిరాడంబరంగా, చల్లగా, ఎంతో చక్కని మంచి సంస్కారం వున్న పత్రికను ఎలాంటి లాభవాంఛ గానీ, ప్రతిఫలాపేక్షగానీ లేకుండా రవీంద్రనాథ్ నిర్వహిస్తున్నారు. దానిని బుద్ధివంతులూ, సంస్కారులూ, చదువుకున్న వారు, మేధావులూ మాత్రమే చదువుతారు. 'మిసిమి' పత్రికను ఎరుగని వారూ, చూడని వారు అత్యధికసంఖ్యలో వుంటారు. చాలా తక్కువమంది చదివే మంచి పత్రికను అయిదు సంవత్సరాలనుంచి ఎంతో వ్యయ ప్రయాసల కోర్చి ఆయన నడపటానికి కారణం ఏమిటో నిత్య వ్యాపార, సర్వలాభ సంస్కారులకు అర్థం కాదు.

ఈ మన తెలుగు నాట ఉత్తమ సంస్కారుల సంఖ్య చాలా తక్కువ. అందునా మంచి పత్రికలు కోరేవారూ, మంచి పత్రికలు చదివే వారు మరీ తక్కువ. అలాంటి అల్ప సంఖ్యాకులకోసం రవీంద్రనాథ్ ప్రచురిస్తున్న 'మిసిమి' గురించి మన తెలుగునాట ఎక్కువమందికి తెలియక పోవడంలో ఆశ్చర్యంలేదు. ఇలాంటి పత్రికలకు ప్రచారం వుండదు. దానిని నడిపినందుకు లాభాలు రావు. అలాంటి పత్రికల సంపాదకులకు సమాజంలో గ్లామర్‌గానీ, ప్రతిష్ఠగానీ ఏర్పడవు. గంధపు మొక్కలాగా నిరాడంబరంగా, గుంభనంగా వుండిపోవాల్సిందే. అయితే అది గంధపు చెట్టు అని ఎరిగినవారు దానిని గౌరవిస్తారు. 'మిసిమి' గురించి ఆమెరికాలోని ఇంటర్నేషనల్ యూనివర్సిటీ ఆఫ్ కాలిఫోర్నియా వారికి తెలియడం, వారు దాని విశిష్టతను గుర్తించడం, ఆయనకు గౌరవ డాక్టరేట్ ప్రదానం చేయాలని నిర్ణయించడం ఎంతో సంతోషించాల్సిన విషయాలు. ఇపుడు గదా ఆ బంగారానికి కొంత పరిమళం అబ్బింది.

జాగృతి

స్వప్నాలు ఎందుకు వస్తాయో, వీటి ప్రయోజనమేమిటో, నిర్మాణం ఎలా వుంటుందో, లౌకికానుభూతికీ, స్వప్నానుభూతికీ ఎలాంటి చుట్టరికముందో, ఈ స్వప్నభావాల అర్థమేమిటో ఫ్రాయిడ్ చాలవరకు పరిశోధించి కనుగొన్నాడు. భావాల తత్త్వాన్ని గూర్చి తెలిసికోవాలంటే స్వప్నాన్నిగూర్చి తెలిసికోవాలి.

ఫ్రాయిడ్ మనస్సును మూడు భాగాలుగా విభజించాడు: 1. బుద్ధి, 2. ఉపబుద్ధి, 3. అవ్యక్తం: మానవుడు నిద్రపోతున్నప్పుడు బుద్ధి పనిచెయ్యదు. అదికూడ నిద్రపోతుందని చెప్పవచ్చును. అంటే జ్ఞానేంద్రియాలు పనిచెయ్యకపోవటంవల్ల అహంత అంతర్ముఖమౌతుంది. అందువల్ల దేశకాలాలు జారిపోతాయి. జాగ్రదవస్థలో ఉన్నప్పుడు బుద్ధి అవ్యక్తంలో దాగి ఉండే వాసనల ఇష్టాలను - తన కంగీకరింపరాని వాటిని- అణచి వేస్తుంది. ఇలా బుద్ధిచేత అణచివేయబడిన ఇష్టాలు, జాగ్రదవస్థలో సాధ్యపడని యిష్టాలు స్వప్నావస్థలో విహారానికి బయలుదేరుతాయి. గడచిన రెండు మూడు రోజుల్లోని అముఖ్య సంఘటన లనే గుర్రాలు వీటికి యుగ్యాలు. ఈ సంఘటనల్లో సాధారణంగా అవాంతరాలవల్ల ఆపివేసిన ఆలోచనలుకాని, ఆలోచించే ఓపికలేక విడిచి పెట్టబడినవికాని, అసలు బుద్ధిలోకి రానీయకుండా ఉపబుద్ధి త్రొక్కిపట్టిన ఆలోచనలుకాని, అముఖ్యంగా కనిపించటంవల్ల జాగ్రదవస్థలో పరిష్కారం పొందనివికాని ఉంటాయి.

ఇలాంటి స్వప్నభావాలన్నీ ఆత్మోత్కర్షకాలుగా ఉంటాయి. అంటే, కలగనేవాడు కలలో నాయకుడుగా ఉంటాడు. కలలో అతడు కనిపించకపోతే స్వప్నపాత్రల్లో ఎవరిలోనో దాగివుంటాడు.

స్వప్నం నిద్రాభంగం కాకుండా చూస్తుంది. అందువల్ల స్వప్న దృశ్యాలు, భావాలు బుద్ధిలోకి ప్రవేశించవు. ప్రవేశిస్తే, నిద్ర చెడిపోతుంది. అవ్యక్తంలో నుంచి వాసనా సంతుష్టిని పురస్కరించుకొని బయలుదేరిన దృశ్యాలను, భావాలను బుద్ధిలో ప్రవేశించకుండాను, తదనుగుణమైన చర్యలను జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు తీసుకోకుండా ఉండేట్లు ఉపబుద్ధి చూస్తుంది. అందువల్ల స్వప్నభావాలు, దృశ్యాలు ఈ ఉపబుద్ధి ఆజ్ఞకు లోబడుతాయి. అందువల్ల, అంటే క్లుప్తీకరణం, వ్యత్యయీకరణం, మిలితీకరణం, వ్యతిరేకీకరణం, సంకేతీకరణం పొందుతాయి. వికల్పభావాన్ని స్వప్నం చిత్రించలేదు. అందువల్ల రెంటినీ ఒకదానిప్రక్క ఒకదాన్ని చేరుస్తుంది. పోలికల్ని, కదుపుల్ని చెప్పవలసివస్తే, పోలికలున్న వాటి నన్నిటినీ ఒకటిగాను కదుపును ఒకదానిద్వారాను చూపిస్తుంది. అందువల్ల స్వప్నంలోని భావాలు, దృశ్యాలు విచిత్రంగాను, అలౌకికంగాను కనిపిస్తాయి. నిజానికి స్వప్నంలో అలౌకిక విషయాలుండవు. దేశకాలాలు జారిపోవటంవల్ల జాగ్రదవస్థలో మనస్సునెక్కి దాగివున్న జాతిగుణద్రవ్య క్రియాచ్ఛాయల్ను అసంతుష్ట అవ్యక్త గత వాసనలు ఉపబుద్ధి ఆజ్ఞలను శిరసావహించి ప్రస్తారం చేస్తాయి. అందువల్ల అలౌకికాలుగాతోచే దృశ్యాలు, భావాలు ఏర్పడు తాయి.

అలౌకికంగా కనుపించే ఒక స్వప్నాన్ని తీసికొని వ్యాఖ్యానిస్తే, భావమనేది లౌకికమో, అలౌకికమో తేలిపోతుంది.

''ఒకామె స్వప్నంలో మూడు సింహాలను చూస్తుంది. అందులో ఒకటి నవ్వుతూ వుంటుంది. ఆమెకు భయం మాత్రం కలుగదు. తరువాత ఎందువల్లనో పరుగెత్తి చెట్టెక్కటానికి ప్రయత్నిస్తుంది. అంతకుముందే ఆవిడ బావో, లేక జ్ఞాతో ఆ చెట్టుకొమ్మల్లో వుంటాడు.''

ఈ స్వప్నాన్ని వ్యాఖ్యానిస్తే యిలా తేలింది. ఆమె ఇంగ్లీషు చదువుకొంటూవుంది. ఇంగ్లీషుపాఠంలో కేసరాలే సింహానికి ఉత్తమమైన అలంకారమని వచ్చింది. ఆమె తండ్రికి సింహపు జూలులాంటిగడ్డముండేది. అందువల్ల కలలో తండ్రి ఒక సింహమయ్యాడు. ఆమెకు ఇంగ్లీషు చెప్పే పంతులమ్మ పేరు లయన్సు. ఇంగ్లీషులో ఈ పదానికి సింహమని అర్థం. ఈమెగూడ ఒక స్వప్న సింహమైంది. పంతులమ్మకు పరిచితురాలైన ఒక కవయిత్రి ఆవిడకు Loewe గేయాలు పంపింది. Loewe అంటే సింహం. కవయిత్రి కూడ ఆమె స్వప్నంలో ఒక సింహమైంది. ఇలాంటి సింహాలకు ఎందుకు భయపడాలి? ఈ మానవ సింహాల్లో ఒకటి నవ్వటంలో ఆశ్చర్య మేముంటుంది?

కాబట్టి శబ్దాన్ని పట్టి చూసినా, భావాన్నిబట్టి చూచినా కావ్యజగత్తు అలౌకికం కాదు. పైగా కావ్యజగత్తులో కేవలం లౌకికాలైన స్వీయచరిత్ర లున్నాయి

48సం. నాటి జ్యోతినుండి

# రేఖ నుండి లేఖ

డా. సం

ప్రియ మందాకినీ,

నేడు కొందరి ఉత్తరాలకు జవాబులు వ్రాస్తున్నాను. కాని నీకు వ్రాస్తున్నది జవాబు కాదు. దీనికి నీవు వ్రాయాలసింది జవాబు.

నాకూ నీకూ ఈ మధ్య అక్షరాలు లేని జ్ఞాపకాలు నడవటం తప్ప అక్షరాలున్న ఉత్తరాలు నడవలేదు. నీవు వ్రాస్తావని నేను, నేను వ్రాస్తానని నీవు నిరీక్షిస్తూ కూచోటం తప్ప ఉత్తర ప్రత్యుత్తరాలు లేనేలేవు.

అది తప్పు అయితే అది మనలో ఏ వక్కరిదీకాదు, ఇద్దరిదీ. తప్పుకాకపోతే నీదీకాదు తప్పు, నాదీ కాదు. ఒకోసారి ఇతర్ల ఉత్తరాలకు ప్రత్యుత్తరాలు వ్రాయటంలో విసుగెత్తిపోయి ప్రత్యుత్తరం కాని మౌలిక లేఖను వ్రాయాలనిపిస్తుంది.

వ్రాయాలనిపించటం వేరు, వ్రాయటం వేరు. వ్రాయాలనిపించేవి అవతలివారికి అందవు; వ్రాసినవి మాత్రమే అందుతాయి.

అందుకని నీకు వ్రాయాలనుకోటం మానుకొని వ్రాయటం మాత్రమే చేస్తున్నాను.

వ్రాయాలనుకోటంలో కంటే వ్రాయటంలో ఒక గొప్ప ప్రయోజనం ఏమంటే వ్రాయాలనుకున్న వాటికంటే వ్రాయాలని అనుకోనివి కూడ వ్రాయటంలోకి వచ్చి వాలుతుంటాయి.

వ్రాయాలనుకొనేదానికి పరిమితి వుండదు, కాని వ్రాసే దానికి పరిమితి వుంటుంది. పరిమితి అనేది కొంతవరకు స్వేచ్ఛకు అడ్డమైనాకూడ ఒకోసారి స్వేచ్ఛ ఇచ్చే పరిణామాల కంటే అది మంచి పరిణామాలనిస్తుంది.

వ్రాయాలనుకోటానికి మాధ్యమం ఆలోచన. ఆలోచన కూడ వినిపించని మాటయే కాని, మాట వినిపించే ఆలోచన. ఆలోచన అనేది నైర్రూప్యమైనమాట, మాట అనేది సారూప్యమైన ఆలోచన.

కనుక వ్రాయాలనుకోటానికి ఎంత విలువ వున్నదో వ్రాయటానికి అంతకంటే ఎక్కువ విలువ వున్నది. వ్రాయాలనుకోటం తనలోనే వుండిపోతుంది కాని ఇతర్లకు చేరదు. వ్రాయటం మాత్రం తనలోనూ వుండిపోతుంది, ఇతర్లకూ చేరుతుంది.

మాటలు లేనిదానికి స్వేచ్ఛ ఎక్కువ, మాటలున్నదానికి బంధన లెక్కువ.

నీకు ఉత్తరం వ్రాయటం ప్రారంభించి ఉత్తరానికి బదులు ఉత్తరాల తీరును గురించి వ్రాస్తున్నాను మరి. సాహితీ రచన చేయ సంకల్పించి వ్యాకరణం వ్రాస్తున్నట్లు!

మనమధ్య నడచే ఉత్తర ప్రత్యుత్తరాలు ఎందుకు ఆగిపోయినాయో కారణం తెలియదు. కారణం తెలిస్తే అసలు ఆగిపోయేవి కాదేమో.

మనిషికి బాధ ఎందుకు కలుగుతుందో అనే కారణం తెలిస్తే బాధను నివారించుకోవచ్చు-

సంపూర్తిగా కాకపోయినా అసంపూర్తిగా అయినా. కారణం తెలిసి కూడా కొన్నిటిని నివారించలేము. అదేమాదిరి కారణం తెలియకుండా కూడా కొన్నిటిని నివారించుకోగలం.

ఏది ఏమైనా, కారణం అనేది జీవితంలో ప్రప్రధానమైంది కాకపోయినా ప్రధానమైంది కాకపోలేదు. అందుకే జీవితంలో హేతువాదానికి తగినంత విలువ వుంది.

మళ్లీ అసలు విషయంలో నుంచి జారాను. మన ఉత్తర ప్రత్యుత్తరాలు ఆగిపోవటానికి కారణం వెదకటానికంటే ఆందుకు ఏ కారణం లేదని నమ్మటం మంచిదనిపిస్తుంది.

జీవితంలో హేతువును కనుక్కోటం అవసరమైనట్లే, కనుగొన్న హేతువుకు కూడ తిరిగి హేతువును కనుక్కోవటం కొంత అవసరమవుతూ ఉంటుంది. హేతువుకు కూడ హేతువుంటుంది. ఆ హేతువుకు కూడ మరో హేతువుంటుంది. దానికి కూడ ఇంకో హేతువుంటుంది. దానికి కూడ... ఈ విధంగా ఈ హేతువుల గొలుసు పొడవుకు అంతం వుండదు.

ఇక అసలు విషయానికొద్దాం. మన ఉత్తరాలు ఆగిపోవటానికి కారణాన్ని వెదికేముందు ఒకరితో మరో వ్యక్తి సంబంధాలు పలచబడటానికి కారణాలు తెలుసుకుందాం.

ఇద్దరు వ్యక్తుల మధ్య పెరిగిన సామ్యానికి కొరతవచ్చినట్లు ఆ ఇద్దరు వ్యక్తులు కాని, వారిలోని ఒక వ్యక్తి కాని నమ్మటం జరిగితే అవతలి వ్యక్తి ఆధిక్యత తనకంటే ఎక్కువ పెరిగినట్లు ఊహించు కొని తాను హైన్య భావాన్ని అనుభవించ సాగుతాడు. దాంతో తాను అవతలి వ్యక్తితో సంబంధాలను తగ్గించుకో ప్రయత్నిస్తాడు.

కాని మనమధ్య ఇటువంటి అవకతవకలు ఏర్పడిన జాడ కాని, ఆ జాడ నీడ కాని కనిపించదు. తెలియకుండా కూడ కొన్ని మార్పులు సంభవించవచ్చు.

సరే, జరిగిన దానికి విచారించక జరుగుతున్న దాన్ని గురించి, జరుగనున్న దాన్ని గురించి అప్రమత్తంగా వుందాం. ఇది విజ్ఞుల లక్షణం.

మన ఇద్దరం కూడ విజ్ఞులమనే నమ్మకం నాకుండబట్టి నేను తిరిగి మన ఉత్తర ప్రత్యుత్తరాలకు శ్రీకారం చుట్ట సాహసించాను. నా సాహసాన్ని నీవు గౌరవిస్తావని నా విశ్వాసం.

అయితే కొన్ని పనులను ప్రథమంగా ప్రారంభించటం సులభమైనంతగా అవి ఆగిపోతే వాటిని తిరిగి ప్రారంభించటం సులభం కాదు.

అందువల్ల నేను ఇప్పుడు తిరిగి ప్రారంభిస్తున్న పని అంత సులభమైంది కాదు. అదే విధంగా కొన్ని పనులను ప్రారంభించటం కంటే ముగించటం సులభం. ఇప్పుడు నేను ప్రారంభిస్తున్న పనికి ఇదివరకే ఆ రెండు దశలు - ప్రారంభించటం, ముగించటం -గడచిపోయి తిరిగి ప్రారంభించటంలో పడ్డందున అది కొంత గడ్డు పని క్రిందకే వస్తుంది. అయినా దాన్ని నెరవేర్చ నిర్ణయించాను.

ఇదుగో ఈ వాక్యాలతో మొదలుపెడతాను:

మందాకినీ, నీ చదువు పూర్తి అయినట్లేనా? పూర్తికాకపోతే పూర్తి చేస్తావని తెలుసు. కాని పూర్తి అయితే ఏమి చేస్తావో తెలియదు. పూర్తి అయినదాన్ని మళ్లీ పూర్తి చేయనవసరం వుండదుగా? ఒకవేళ పూర్తి అయితే నీవేమి చేస్తావో నాకు తెలుసునని నేను భ్రమచెందితే అది నీవు వివాహితవు అవుతావని.

నీవు అందరు అమ్మాయిలలాంటి దానివి కాకపోబట్టి నీవు ఇపుడపుడే పెళ్లిజోలికి పోవేమో అని కూడా నా నమ్మకం.

నీవూ నేనూ కూడ ఒకర్థంలో ఒకేజాతి వాళ్లం. అంటే స్త్రీ జాతికి చెందినవాళ్లం. కాని నేను వివాహితను, నీవు కాదు.

నేను వివాహితనైవుండి నిన్ను అవివాహితగా వుండిపొమ్మని సలాహించటం స్వార్థానికి లక్షణమో నిస్వార్థానికి లక్షణమో నాకు సరిగా తెలియదు.

అందువల్ల అటువంటి సలహాలు నేను నీకు ఇవ్వదలచలేదు. అయితే ఒకటి మాత్రం అబద్ధం కాదు. అదేమంటే స్త్రీకి కాని పురుషునికి కాని జీవితంలో వివాహమనేది సర్వస్వం కాదు.

అయితే, కొందరి దృష్టిలో వివాహమనేది సర్వప్రధానం కాకపోయినా జీవితంలోని కొన్ని ప్రధాన విషయాలకు అది స్ఫూర్తినిస్తుందని, మరికొందరి దృష్టిలో ఆర్తినిస్తుందని.

కాని నా దృష్టిలో వివాహమనేది ఆర్తినివ్వదు, స్ఫూర్తినివ్వదు. ఆ రెండూ కూడా వివాహిత వ్యక్తుల అర్హతలమీద ఆధారపడి వుంటాయని.

అందువల్ల ఆ విషయాన్ని గురించి నీకు నీవు ఆలోచించి నిర్ణయించుకోవలసిందేకాని ఇతర్ల సలహాలు పనికిరావు.

వివాహానంతర జీవితం వివాహాత్పూర్వ జీవన వైఖరి మీద ఆధారపడి వుంటుంది. నా వరకు నాకు నా వివాహిత జీవితంలో వివాహపు ముందు లేని బాధలు కాని వ్యధలు కాని తలెత్తలేదు. అయితే ఇది నెగెటివ్ విషయం. ఇక పాజిటివ్ లోనికి వస్తే నూతనానందానుభవాలు అంతకు ముందులేనివి కొన్ని ప్రత్యక్షం కాలేదని చెప్పను. నేను ఇంతకుముందే చెప్పేను కదూ, అవీ ఇవీ అన్నీ వ్యక్తిలోని జీవించే అర్హతపై ఆధారపడి వుంటుందని. కొందరి వివాహిత జీవితాల్లో నెగెటివ్ భాగాలు ఎక్కువ వుంటే మరికొందరిలో పాజిటివ్ భాగాలు.

నీకు తెలుసుగా, నేను భర్తకు భార్యను మాత్రమే కాను, ఇద్దరు పిల్లలకు తల్లిని కూడా. భర్తకు భార్య కావటంకంటే పిల్లలకు తల్లికావటంలో ఎక్కువ అర్హత కలిగి వుండాలిసి వస్తుంది.

నీవు అడగవచ్చు, ఆ రెండు అర్హతలు - భార్య, తల్లి - లేకుండా స్త్రీ జీవితం ఆనంద వీణగా మ్రోగటానికి వీలు లేదా అని. 'లేదు' అనే అంత మూర్ఖురాలను కాదు కాని అందుకు ఇంకా ఎక్కువ అర్హత కావాలని మాత్రం అనగలను.

ఒకే ఉత్తరంలో నీకెన్నని విషయాల్ని విశదీకరించేది? నీ జవాబు అందుకున్న తరువాత సందర్భాన్ని బట్టి మరికొన్ని విషయాలు తెలుపగలను.

నాకు తెలుసు నా కంటే నీకు ఎక్కువ విషయాలు తెలుసు అని. అయినా, తెలపటంలో నాకున్న ఆనందాన్ని అనుసరించి వాటిని తెలపటానికి ఆనందిస్తున్నాను. నీవు వాటిని వినటంలో ఆనందిస్తే నేను కూడా ఆనందిస్తాను, మళ్లీ మళ్లీ! చాలు నేటికి.

నీ
రేఖ

# దుక్కిటెద్దు

**కె. కుటుంబరావు.**

'వద్దు, వద్దు! నాకు డాక్టర్రొద్దు! రెండు రోజులుంటే అదే నిమ్మళిస్తుంది!' అన్నాడు కిష్టయ్య, ఆయాసంగా.

'అదేమిటి, నాన్నగారూ? అదే నయం కావటమేమిటి? అసలు జబ్బేమిటో తెలుసుకోనివ్వండి. ముందుగా జాగ్రత్తపడాలిగాని, రోగం ముదరబెట్టు కుంటారా?' అన్నది అనసూయ. ఆమె పిల్లలు నలుగురూ ఆమె చుట్టూ నిలుచున్నారు.

'పిల్లలకోడి' అని కిష్టయ్య తన కూతురికి ఏనాడో పేరు పెట్టుకున్నాడు. కాని ఆయన ఆ మాట ఎప్పుడూ పైకి అనలేదు. ఆయన పెళ్ళాంతోగాని, పిల్లలతోగాని అనని విషయాలు, ఇటువంటివి, ఇంకా బోలెడున్నై... అనసూయకు పిల్లలకోడి అని పేరు పెట్టుకున్నాక, ఆవిడ పిల్లల్ని వెంటేసుకుని ఇంట్లో కనిపించినప్పుడల్లా కిష్టయ్యకు నవ్వొచ్చేది. ఒకసారి అనసూయ ఆయన నవ్వుకుంటూండటం గమనించి, 'ఏమిటి నాన్నా, నవ్వుతున్నావు?' అని అడిగింది.

'ఏం లేదు, ఏంలేదు! ఏదో జ్ఞాపకం వచ్చింది,' అన్నాడు కిష్టయ్య.

అనసూయ నమ్మలేదు. ఆమెది అసలే అనుమానం మనసు. పిల్లల తల్లి అయికూడా పుట్టింటిని విడవకుండా ఉండటమేకాదు, తనకు తల్లిదండ్రులుగాని, అన్నదమ్ములుగాని ఎక్కడ ఏ లోపం చేసిపోతారో అని వెయ్యికళ్ళతో కనిపెట్టి ఉండేది. అనుమానించటానికి ఏమాత్రం అవకాశం దొరికినా సూటిపోటీ మాటలని సాధించేది. ఎన్నో ప్రమాణాలూ, క్షమాపణలూ అయినదాకా వదిలేదికాదు. తన నోటికి ఇంటిల్లిపాదీ వెరుస్తారన్న నమ్మకం ఒకటి ఆమెకు గొప్ప అండగా ఉంటూ వస్తున్నది...

తండ్రి తనను చూసే నవ్వాడన్న అనుమానం పోలేదు. కాని ఏం చెయ్యలేక, కుడిచేతికి అందిన కొడుకుని ఒక్కటిపెట్టి, 'పదా!' అన్నది. నోట్లో నుంచి తాపీగా వేలుతీసేసి, నింపాదిగా కళ్ళు మూసి, నోరు బార్లా తెరిచి బావురుమన్నాడు. నలుగురు పిల్లల్నీ వెంటబెట్టుకుని అనసూయ అవతలికి వెళ్ళిపోయింది.

'ఉపగ్రహాలు!' అనుకున్నాడు కిష్టయ్య, అనసూయ పిల్లలకు కొత్త నామకరణం చేసుకుంటూ.

ఒకప్పుడు కిష్టయ్య తన భార్యను గురించి, పిల్లల్ని గురించీ మురిసినవాడే. ఆయన చిన్నతనంలో కష్టాలు పడ్డాడు. ఆయన తన తల్లి నెరగడు. తండ్రి రెండో పెళ్ళి చేసుకున్నాడు. మారుతల్లి కిష్టయ్యని చాలా నీచంగా చూసేది. వాళ్ళపల్లెటూళ్ళో ఇంగ్లీషు బడిలేదు. బస్తీ చదువు డబ్బు దండగన్నది మారుతల్లి. తండ్రి కాదనలేదు. కిష్టయ్య- పదేళ్ళవాడు. ఇంట్లో చెప్పకుండా బస్తీకి వెళ్ళి వారాలు చేసుకుని, పుస్తకాలూ జీతం డబ్బులూ, ఇతరులు పారేసిన బట్టలూ ముష్టెత్తి చదువుకున్నాడు. తాను మేజరై తండ్రితో ఆస్తి పంపకం చేసుకునేసరికి కిష్టయ్య చదువు అయే పోయింది.

ఇతరుల్ని మంచి చేసుకునే విద్య కిష్టయ్య చిన్నతనం నుంచీ విధిగా అలవరించుకున్నాడు. 'మంచివాడు' అనిపించుకోవటం, ఇతరులను ఏ మాత్రమూ నొప్పించకుండా వారి పూర్తి సహకారం పొందటం, పొందిన సహాయానికి రెట్టింపు కృతజ్ఞత చూపటం ఆయనకు బాగా అలవాటైపోయింది. ఇదే ఆయనకు ఉద్యోగంలో పైకి రావటానికి కూడా ఎంతో ఉపకరించింది. చదివినది స్కూలు ఫైనలే అయినా పెళ్ళి నాటికి అప్పుడే నూరు రూపాయలు - ఆ రోజుల్లో బియ్యేలు కూడా చెయ్యలేని సంపాదన - సంపాదిస్తున్నాడు.

భార్య కాపరానికి వచ్చాక కిష్టయ్య ఆనందానికి మితిలేదు. 'తను' అన్న మనిషంటూ కిష్టయ్య ఎరగడు. ఇప్పుడాయనకు ఒక భార్యా, సహజీవనమూ, తన యిష్టప్రకారం ఇల్లు అమర్చుకోవటం, వంట చేయించుకు తినడం ఏర్పాటయింది. పిల్లలు పుట్టుకొచ్చారు - ఇద్దరు కొడుకులూ, ఒక కూతురూ, మళ్ళీ ముగ్గురు

కొడుకులూనూ. తన భార్యనూ, ఆరుగురు పిల్లల్నీ తనకు సాధ్యమైనంతగా సుఖపెడతానని క్రిష్టయ్య శపథం చేసుకున్నాడు. వాళ్లకేలోటూ రాకూడదని అదనంగా రెండు రూపాయలు సంపాదించటానికి రెండు పూటలు తిండి లేకుండా తిరగవలసి వస్తే తిరిగాడు.

క్రిష్టయ్య ఏళ్ల తరబడి దుక్కి-టెద్దులాగా పనిచేశాడు. ఎన్ని వ్యాపారలలోనో భాగం తీసుకున్నాడు. ఆ వ్యాపారాలు దండగపాలు కాకుండా తానే స్వయంగా పైపెట్టున ఉండి నడిపాడు. దీని ఫలితం క్రిష్టయ్య తప్ప అందరూ అనుభవించారు. క్రిష్టయ్య పెళ్ళాం నూరు రూపాయలకు తక్కు-వ చీరె కట్టి బయటికి పొయ్యేది కాదు. క్రిష్టయ్య కొడుకులకు చదువు సంధ్యలు అబ్బినా అబ్బకపోయినా సరికొత్త ఫాషన్‌లో దుస్తులు ధరించటం, మోటారు సైకిళ్లెక్కి- తిరగటం, టెన్నిస్ ఆడటం మొదలైనవన్నీ అబ్బినై.

పెద్దవాడు చిన్న టెన్నిస్ ఛాంపియన్. వాడికి స్పోర్ట్స్ ప్రపంచం తప్ప, ఇంకేమీ తెలీదు. తాను ఉద్యోగం చెయ్యబోవటం లేదని వాడు చదువుతూండగానే ప్రకటించాడు. రెండోవాడు ఇంజనీరు చదివి, జెంషెడ్పూరులో ఉద్యోగం సంపాదించాడు. వాడి భార్య లక్షాధికార్ల బిడ్డ. ఆవిడ తాహతుకు తగినట్టుగా బ్రతకటానికి తండ్రి దగ్గర నుంచి ప్రతినెలా వందా, రెండు వందలూ తెప్పించుకుంటాడు. మూడో వాడికి చీట్లాటపిచ్చి. అందులో వాడు సంపాదిస్తాడని ప్రతీతి. కాని వాడికింద క్రిష్టయ్య ఏటా నాల్గైదు వేలు ఖర్చు చేస్తూనే ఉన్నాడు. నాలుగోవాడికి సినిమా స్టారు కావాలని. వాడు స్కూ-లు ఫైనలుతో చదువు ఆపేశాడు. చదవరా అని క్రిష్టయ్య అంటే, 'నీవు చదివినంతనేనూ చదివాను. సినిమా స్టారు ఛాన్సురానీ నీకన్న ఎక్కు-వే సంపాదిస్తాను' అనేశాడు. అయిదోవాడు మాత్రం చదువుతున్నాడింకా.

అనసూయకు పదో ఏటనే పెళ్లి చేశారు- శారదా చట్టాన్ని ధిక్క-రించి. బాగా ఉన్నవాళ్ళ పిల్లవాణ్ణి చూసి చేశారు. అనసూయను మొగుడి దగ్గరికి పంపిన కొద్ది రోజులకే ఆమె అత్తవారి ఆస్తంతా అప్పులవాళ్ల పాలయింది. డిప్రెషన్ వాళ్ళమీద పెద్దదెబ్బ తీసింది. 'మహాతల్లి మెట్టిన వేళావిశేషం ఎటువంటిదో, లక్ష రూపాయల ఆస్తి సోదిలోకి రాకుండా పోయింది!' అని అనసూయ వింటుండగా అత్తవారు అన్నారు. అనసూయ అప్పటికప్పుడే పెట్టే, బేడా సద్దుకుని పుట్టింటికి బయలుదేరి వచ్చేసింది. మళ్ళా అత్తవారింటి మొహం చూడలేదు. ఒక వారంరోజులు వెనకగా అనసూయ భర్త కామేశ్వరరావు కూడా వచ్చేశాడు.

'కాపరానికి వచ్చాడు అల్లుడు!' అనుకున్నాడు క్రిష్టయ్య, తనలో తాను ఆనందపడుతూ.

కామేశ్వర్రావంటే ఎందుకో క్రిష్టయ్యకు మొదటినుంచీ కూడా మంటే! ఈ మంటకు పెద్ద కారణాల్లేవు. ఉన్నవన్నీ అతి చిన్న కారణాలు. గొప్ప చెప్పుకుంటాడు, అబద్ధాలాడతాడు, పెళ్ళామంటే అంతులేని ఆపేక్ష అభినయిస్తాడు. ఈ అభినయాన్ని క్రిష్టయ్య ఏనాడూ నమ్మలేదు. మరి మిగిలిన వాళ్ళంతా నమ్మారు.

అనసూయకు చాలా రోజులు పిల్లలు లేక వరసగా నలుగురు పుట్టుకొచ్చారు. క్రిష్టయ్య వాళ్ళందర్నీ పగవాడల్లే చూసేవాడు. కొడుకుల పిల్లలూ, కూతురి పిల్లలూ డజను మంది దాకా ఉన్నారు. వాళ్ళల్లో ఎవరు కనిపించినా క్రిష్టయ్యకు జెర్రులు పాకినట్లుండేది. 'లంకంత ఇల్లున్నది! వీళ్ళు నేనున్న చోటికే ఎందుకు వస్తారో!' అనుకునేవాడు.

క్రిష్టయ్యకు మనుషులంటే అసహ్యం మనవలతో, మనవరాళ్ళతో ఆరంభం కాలేదు; పెళ్ళాం పిల్లలతో ఆరంభమయింది. వాళ్ళు ఆయనను డబ్బు సంపాదించే యంత్రంగా చూడసాగారు. డబ్బు కావలసి వస్తేనే తన దగ్గరికి వచ్చేవాళ్ళు. డబ్బు దేనికో తెలుసుకుందామని తాను ఎప్పుడన్నా విచారిస్తే చెప్పటానికి చాలా విసుక్కు-నే వాళ్లు. ఒక్క- కామేశ్వర్రావే తన దగ్గిరికి వచ్చి కూచుని ఏవేవో వ్యాపారాలను గురించి గంటల తరబడి మాట్లాడేవాడు. చివరక్కు రెండు వేలు మూడు వేలు పెట్టుబడి కావాలని బయట పెట్టేవాడు.

తాను ఏపూటా సరిగా వేళకు భోంచేసేవాడుకాడు క్రిష్టయ్య. కాని దానికి అందరూ అలవాటుపడిపోయారు. ఒకరాత్రి పన్నెండు గంటలకు ఇంటికివస్తే అందరూ నిద్రలు పోతున్నారు. 'భోజనం

చేస్తావా?' అని అడిగినవాళ్లు లేరు. అన్నం పెట్టమని అడిగితే పెట్టేవాళ్లే. ఎందుకో కిష్టయ్యకు అడగ బుద్ధి కాలేదు. భోజనం చెయ్యకుండానే పడుకున్నాడు.

ఇంట్లో కిష్టయ్య తప్ప మిగిలిన వాళ్ళందరి మధ్యా ఏవో బంధాలున్నాయి. వాళ్ళు ఆప్యాయంగా మాట్లాడుకునే వాళ్లు. అంతలో చడామడా తిట్టుకునేవాళ్ళు. కాని వాళ్ళ మధ్య కిష్టయ్యకు ఏమీ స్థానం లేదు.

'వీళ్ళందరి కోసం నేనెందుకు హూనం కావాలి. నా తిండికీ బట్టకూ యాభైచాలు. నాకు వ్యసనంకూడా అలవాటు లేదు,' అని కిష్టయ్య చాలాసార్లు అనుకున్నాడు. కాని దొర్లేరాయి దొర్లుతూనే ఉంది. సగం ఈ మూకను మరిచిపోవటానికే పై పనులు పెట్టుకున్నాడు. ఎప్పుడైనా పెందలాడే ఇంటికివచ్చినా, ఇల్లుదాటి పోకపోయినా ఏదో ఆత్మద్రోహం చేసినట్టుగా తోచేది.

'ఇవాళ తాత ఇంట్లోనే ఉన్నాడే!' అనేవాళ్లు కుర్రాళ్ళు. అందులో కిష్టయ్యకి ఏదో వెటకారం వినిపించేది. తరవాత కాస్సేపటికి ఇంకెవరో వచ్చి, గోడల్ని అడిగినట్టుగా, 'ఇవాళనాన్న ఎక్కడికిపోలేదల్లేఉందే!' అనేవాళ్ళు. ఆఖరుకు అసలావిడ, 'వెళ్ళారనుకున్నా, ఉన్నారా?' అనేది.

ఇంట్లో ఎవరికీ తను అవసరం లేదని తెలుసుకోవటానికి కిష్టయ్యకు చాలా కాలం పట్టింది. తాను ఏదైనా మాట్లాడినప్పుడు ఎవరూ సాంతం వినేవారు కారు. ఇది గమనించాక కిష్టయ్య అనేక డజన్లసార్లు రుజావు చేసుకున్నాడు. కాని ఎవరితోనూ ఈ మాట అనలేదు.

కిష్టయ్యకు మరీ మంట ఎత్తింది. దేనికంటే, తాను అనేక మంది సహాయం పొందాడు, కాని వారందరికీ తన కృతజ్ఞత చూపాడు. ఈ మూక తనవల్ల ఇంత సహాయం పొందుతూ కూడా తన కష్టసుఖాలు ఎందుకు విచారించరు? తనకు యాభై ఎనిమిదో ఏడు. ప్రభుత్వోద్యోగం చేసినట్టయితే పించను పుచ్చుకుని సుఖపడవలసిన వయసు. అదంతా లేకపోగా ఎంత ఇచ్చినా ఇంకా ఇమ్మనే మాట. డబ్బు ఇవ్వటానికి తప్ప మిగిలిన అన్ని విషయాలకూ తాను పరాయివాడే!

కిష్టయ్యకు జబ్బుచేసింది. ఆరోగ్యం చెడింది. చెడదూ? విధీ విరామం లేకుండా పనిచేస్తుంటే ఎంతకాలం ఆరోగ్యం ఉంటుంది? అందులోనూ ఈ వయసులో!

'ఈసారి నేను చచ్చిపోతాను! అనుకున్నాడు కిష్టయ్య. ఈ జబ్బు నుంచి ఆయనకు కోలుకోవాలని లేదు. ఈ అవతారం ఇక చాలించ వచ్చు ననిపించింది.

కాని మిగిలిన వాళ్ళకు ఆయనను చావనివ్వాలని ఏ కోశానా లేదు. డ్యాక్టరును పిలవనంపారు. తనకు డ్యాక్టరు అవసరం లేదన్నాడు కిష్టయ్య.

డ్యాక్టరు రానే వచ్చాడు పరీక్షచేశాడు, విశ్రాంతి తీసుకోమన్నాడు. ఏవో ఇంజెక్షన్లూ, టానిక్కులూ రాసి ఇచ్చాడు.

డబ్బు దండుగ. నా బతుకు ఎట్లా ఆరంభమయిందో అట్లాగే ముగుస్తుంది, నా అనేవాళ్లు లేకుండా. నా బతుకు నేను బతికినప్పుడు ఏ డ్యాక్టరూ నాకు ఇంజెక్షన్లిస్తాననలేదు. ఎందుకంటే అప్పుడు డబ్బు లేదు గనక. ఇప్పుడు డబ్బుంది డ్యాక్టర్లు చేతికొచ్చిన మందులల్లా రాసిస్తారు. అవి ఏమీ చెయ్యలేవు,' అనుకున్నాడు కిష్టయ్య.

కాని ఇంజెక్షన్లు పనిచేశాయి. విశ్రాంతి కూడా కొంత పని చేసిందేమో? కిష్టయ్య మంచంలో లేచి కూచుంటే అందరి ముఖాలూ విప్పారినై.

'బంగారు గుడ్లు పెట్టే కోడి చావలేదని ఎంత సంతోషం!' అనుకున్నాడు కిష్టయ్య.

లేడికి లేచిందే ప్రయాణం. కాస్త ఆరోగ్యం కుదుటపడగానే కిష్టయ్యకు ఏమీ చెయ్యకుండా ఉండటం

దుర్భరమనిపించింది. అధమం ఏదన్నా చదువుదా మనుకున్నాడు. అనసూయ ఆఖరు కొడుకు కనిపిస్తే వాణ్ణి పిలిచి, 'చదువుకునేందుకు ఏదన్నా పత్రికారా!' అని అడిగాడు.

వాడు వెళ్ళి ఏదో పత్రిక తెచ్చి ఇచ్చాడు. కిష్టయ్య పేజీలు తిరగేస్తూ, 'పట్టి చెత్త! ఇహమూ, పరమూ లేని రాతలు!' అనుకున్నాడు. అకస్మాత్తుగా ఆయన దృష్టి కొన్ని పద్యాలమీద పడింది. పద్యాలకు 'దుక్కి టెద్దు' అని శీర్షిక ఉంది. దానికింద తన ఆఖరు కొడుకు పేరుంది.

'వీడు తిక్కన సోమయాజి అని నేను ఎరగనే! అనుకుంటూ కిష్టయ్య పద్యాలు చదవసాగాడు. పొలాల మొహం ఎరగని తన ఆఖరు కొడుకు దుక్కిటెద్దు గురించి పద్యాలు రాయటమేమిటి?

కాని కుర్రాడు కిష్టయ్య అనుకున్నంత తెలివితక్కువ వాడు కాడు. వాడు తానెరిగిన దుక్కిటెద్దు గురించే రాశాడు. ఆ దుక్కిటెద్దుకు జీవించటం చాతకాదు. తన కష్టసుఖాలను ఇంకొకరితో పంచుకోదు. ఇతరుల కోసం అస్తమానం శ్రమపడి వాళ్లను సోమరి పోతులనుగా చేసి, వారంతా తనకు రుణపడి ఉన్నారని సంతోషిస్తుంది. వాళ్ళు తనకు కృతజ్ఞత చూపటం లేదని మనసులో బాధపడుతుంది. క్రమంగా దాని హృదయంలో ఆపేక్ష, అంతఃకరణలకు చోటుండదు. ఆఖరుకు కోపం వచ్చి కొమ్ము విసరటం కూడా చాతగాని స్థితిలో పడి చావుకోసం ఎదురు చూడసాగుతుంది.

కిష్టయ్య ఆఖరు కొడుకు కొద్ది పాటి హాస్యధోరణిలో రాసిన అయిదు పద్యాల సారాంశమూ ఇంతే.

'ఓరి పిడుగా!' అనుకున్నాడు కిష్టయ్య. కిష్టయ్యలో కొద్దిపాటి హాస్యం ఉంది. అది ఎవరికీ కనపడ నిచ్చేవాడు కాడు. అదే తన కొడుక్కు కూడా సంక్రమించింది. వాడు కూడా పైకి హాస్యం ఉన్నట్టు కనిపించడు.

అనసూయ గ్లాసులో పళ్ళరసం తెచ్చింది.

'ప్రతిపూటా నాకు పంచదార తక్కువవుతున్నది!' అంటూ గొణిగాడు కిష్టయ్య.

'తక్కువైతే అడిగి వేయించుకోరాదూ?' అన్నది అనసూయ ఆశ్చర్యంగా.

'అదే దుక్కిటెద్దు లక్షణం!' అన్నాడు కిష్టయ్య.

'ఏమిటీ?' అన్నది అనసూయ అయోమయంగా.

'ఏం లేదులే! పిల్లల్నందర్నీ ఒకసారి పంపించు.'

'దేనికీ?'

'దేనికేమిటి? పంపించమంటుంటే!'

అనసూయ తల అడ్డంగా ఆడించి వెళ్ళిపోయింది.

కాస్సేపటికి ఏడెనిమిదిమంది పిల్లలు కిష్టయ్య గదిలోకి వచ్చి కుక్కిన పేలల్లే నిలబడ్డారు.

'చదవండి, నా వెంట!' అంటూ 'దుక్కిటెద్దు' పద్యాలు వాళ్ళ చేత చదివించాడు. వాళ్లు మొదట బెరుకు బెరుకుగా చదివారు గాని రాను రాను గొంతులు హెచ్చినై.

తండ్రి పంచదార కావాలని అడిగినమాట మరచిపోయిన అనసూయ తిరిగి జ్ఞాపకం తెచ్చుకుని పంచదార సీసా, చంచా పట్టుకుని వచ్చేసరికి కిష్టయ్య గది వీథిబడి లాగా ఉంది. పిల్లలంతా కప్పెగిరిపొయ్యేట్టు తాత వెంట పద్యాలు చదువుతున్నారు. పళ్ళరసం గ్లాసు పక్కనే బల్లమీద ఖాళీగా పెట్టి ఉంది. దాని అడుగున చూచాడు. పంచదార కరిగీ కరగకుండా మిగిలి ఉన్నది.

'పంచదార చాలా ఎక్కువేశావ్!' అన్నాడు కిష్టయ్య అనసూయకేసి చూడకుండానే.

పిల్లలు 'దుక్కిటెద్దు' గోలగా చదువుతూనే ఉన్నారు. అవి వాళ్ళకు అప్పుడే కంఠతా వచ్చేశాయి

# సంగీత సన్న్యాసం చేసిన కొందరు గాయనీమణులు

- యస్. సదాశివ

గాన తపస్వినిగా పేరొందిన అంజనీబాయి మాల్పేకర్ గురుశిష్య పరంపరాగత సంప్రదాయంలో కఠోరతపస్సుచేసి సాధించిన సంగీత విద్యను ''కృష్ణార్పణం'' అని చేతులు దులుపుకున్నది. అలాటి కొందరు గాయనీమణుల గురించి ముచ్చటించుకుందాం.

బాబ్లీబాయి గురించి చాలమందికి తెలియదు. ఆగ్రా ఘరానాకు చెందిన ఉస్తాద్‌నత్థన్ ఖాన్ శిష్యురాలామె. సహజంగానే సశక్తమైన గాత్రమామెది. ఉస్తాద్ నత్థన్ ఖాన్ శిక్షణ ఆ గాత్రానికి అన్నిహంగులు సమకూర్చింది. స్వర లయలపై ఆమెకు గల అధికారం సాటిలేనిది. సంగీతంకోసమే తన జీవితాన్ని ఎత్తుగట్టి జీవితాంతం బ్రహ్మచారిణిగా వుంటానని ప్రతిజ్ఞచేసింది. ఆరడుగుల మూడంగుళాల యెత్తు. ఎత్తుకు తగిన లావు - పూటకు రెండు కోళ్ల భుక్తి. రోజూ పద్దెనిమిది గంటల రియాజ్. గాయని మాత్రమే కాదామె. గ్రామాలాంటి పహెల్వాన్. మాతృభాష గుజరాత్‌గాని సంస్కృతంలోను, హిందీలోను, ఫారసీ ఉర్దూలోను ఆమె పాండిత్యం అనల్పమైంది. ఆమె పాడి లేచిన తర్వాత ఆ ఆసనంమీద కూర్చుండి పాడే సాహసం చేసేవాళ్లు కారెవరూ. ఉస్తాద్ అబ్దుల్ కరీం ఖానంతటి మహాగాయకుడు సైతం మర్యాదగా తప్పించుకునేవాడు.

ఉస్తాద్ నత్థన్ ఖాన్ జన్మదిన సందర్భాన అతని శిష్యులొక సంగీతసభ ఏర్పాటు చేసినారు. ప్రఖ్యాతిగాంచిన గాయనీ గాయకులు పాల్గొన్నా రందులో. తనపేరు పిలువగానే బాబ్లీబాయి ఆసన మలకంరించి అద్భుతంగా పాడింది. ఆమె తర్వాత పాడవలసిన ఉస్తాదులున్నారు. ఆమెకు ఏమి తోచిందో ఏమోకాని ఆసనం మీదినుంచి లేస్తూ ''నా గురువుగారు తప్ప నా తరువాత-ఈ ఆసనం మీద కూర్చుండి తమ గానంతో శ్రోతలను మెప్పించేవాళ్లెవరైనా ఉంటే వారి శిష్యురాలినైపోతాను'' అని ఛాలెంజి చేసింది. సాధారణంగానే ఆమె పాడిన తర్వాత పాడటానికి ఎంతటిగొప్ప వాళ్లయినా సంకోచిస్తారు. ఆ ఛాలెంజిని ఎవరూ స్వీకరించటానికి ముందుకు రాలేదు. తన శిష్యురాలి అహంకారం ఉస్తాద్ నత్థన్ ఖాన్‌కు చాల మనస్తాపం కలిగించింది. సంగీత ప్రపంచంలో గౌరీశిఖరం అని ప్రసిద్ధి గాంచిన ఉస్తాద్ అల్లాదియాఖాన్ ఆ సభలోనే వున్నాడు. ఉస్తాద్ నత్థన్ ఖాన్ ఎంతో ప్రాధేయపడితే అల్లాదియాఖాన్ కొంతసేపు పాడినాడు; బాబ్లీబాయి ఛాలెంజిని స్వీకరించి మాత్రం కాదు.

అంతటి అహంకారం, అహంకారానికి తగిన సామర్థ్యంగల బాబ్లీబాయి ఉన్నట్లుండి ఒకనాడు శాస్త్రీయ సంగీతానికి స్వస్తి చెప్పింది. శేషజీవితం భజన కీర్తనల్లోనే గడిపింది కాని శాస్త్రీయ సంగీతం జోలికి పోలేదిక. బాబ్లీబాయి సాల్‌గాంవ్ కర్ పేరు గాయనిగా కాక భక్తురాలుగా మిగిలిపోయింది.

ఉస్తాద్ నత్థన్ ఖాన్ శిష్యురాలే సరస్వతీ బాయి జాంబావ్ లేకర్. శారీరకంగా బాబ్లీబాయి లాంటి పహెల్వాన్ కాకున్నా సంగీత విద్యలో పహెల్వానే. ఆమె పాడిన తర్వాత పాడటానికి పెద్దపెద్ద గాయకులే సిద్ధపడేవాళ్లు కారు. యౌవనంలోనే ఒక సన్న్యాసి శరణు జొచ్చి ఆధ్యాత్మిక సాధనలో తన జన్మను ధన్యం చేసుకొన్నది.

అంజనీబాయి మాల్పేకర్, బాబ్లీబాయి సాల్‌గాంవ్‌కర్, సరస్వతీ బాయి జాంబావ్ లేకర్ గోవా (గోమంతక్) కు చెందినవాళ్లు. గోవానుంచి వచ్చి మహారాష్ట్రలో స్థిరపడిన వాళ్లలో సన్న్యసించినవాళ్లే చాలమంది. అట్లని అంతా సన్యసించినారని కాదు. మంగేష్కర్ కుటుంబం గోవానుంచి వచ్చిందే. కేసర్‌బాయి కేర్కార్, మోగూబాయి కుర్డీకర్‌ల పూర్వీకులు గోవా వాళ్లే. వాళ్లంతా సంగీతంలో జన్మసాఫల్యం పొందినారు.

గోమంతక్‌కు చెందని వాళ్లు కొందరు ఎందుకో సంగీతంపట్ల విరక్తులైనారు.

భాస్కర్ బువాబఖ్లే శిష్యురాలు తారాబాయి శిరోడ్కర్ పాటకచేరీ విని ''పాడితే అలా పాడాలె'' అనుకున్నదట

అభ్యాసదశలో హీరాబాయి బరోడేకర్ - అంతటి తారాబాయి అర్ధంతరంగా సంగీత సన్యాసం చేసింది. కారణాలు తెలియవు.

ఉస్తాద్ భూర్జీ ఖాన్ సన్నిధిలో సాకల్యంగా సంగీత కళను అభ్యసించింది మేనకాబాయి శిరోడ్కర్. ఆమె అప్సరసల వంటి అందగత్తె. పండిట్ మల్లికార్జున్ మన్సూర్ కూడ ఉస్తాద్ భూర్జీఖాన్ శిష్యుడే. ఉస్తాద్ అల్లాదియాఖాన్ చిన్నకొడుకు భూర్జీఖాన్. కేసర్‌బాయి కేర్కార్ ఉస్తాద్ అల్లాదియాఖాన్ శిష్యురాలు. ఆమెను 'సర్వశ్రీ' అనే బిరుదునామంతో పిలిచేవాళ్లు. ఆ బిరుదు గురుదేవ్ టాగూర్ ప్రదానం చేసినాడని కొందరంటారు. కొందరు మహారాష్ట్ర సంగీత రసికులిచ్చినారంటారు. ఏది యేమైనా శాంతి నికేతన్‌లో ఆమె పాటకచేరీ ఏర్పాటుచేసి గురుదేవ్ టాగూర్ ఆమె సంగీతం విన్నందుకు ఆమె జీవితం సార్థకమైందనటం మాత్రం వాస్తవం.

ఒకసంగీత సభలో మేనకాబాయి తర్వాతకేసర్‌బాయి పాడవలసింది. మేనకాబాయి జయజయవంతీ రాగంలో ఒక అపూర్వమైన చీజ్‌ను అద్భుతంగా వినిపించింది. ఆ తర్వాతకేసర్‌బాయి పాడలేదు. మేనకాబాయికి అది ఘన విజయం. ఆ పాటకచేరీ తర్వాత ఆమె సరాసరి తన గురువుగారింటికి వెళ్లి, అతని పాదాలు పట్టుకొని శ్రద్ధాభక్తులను, కృతజ్ఞతను ప్రకటించుకున్నది. అంతటి మేనకాబాయి సంగీతానికి స్వస్తి చెప్పి నర్తకిగా మారింది. కొన్ని బొంబాయి సినిమాల్లో ఫిల్మ్‌డాన్స్ ప్రదర్శించి అజ్ఞాతంలోకి వెళ్లిపోయింది. నేడు బేగం అఖ్తర్ వలెనే ఠుమ్రీలు, దాద్రాలు, గజల్లు పాడుతున్న శోభాగుర్టు మేనకాబాయి కూతురే.

ఇంకొక మహాగాయకురాలి ప్రసక్తితో ఈ వ్యాసం ముగిస్తాను. ఆమెపేరు తానీబాయి. రాణివాసపు స్త్రీ కనుక ఆమె పాటకచేరీల్లో పాల్గొనలేదు. పబ్లిగ్గా పాడలేదు. తన పాటలు రికార్డు చేయించలేదు. కనుక ఆమెగురించి అందరికీ తెలియదు.

కొల్హాపూర్ సంస్థానాధిపతి ఛత్రపతి శాహూమహారాజ్. కొల్హాపూర్‌లో చరిత్ర ప్రసిద్ధమైన మహాలక్ష్మి ఆలయం వున్నది. శాహూమహారాజ్ అమ్మవారి భక్తుడు. సంగీతప్రియుడు. అతన్ని రాజర్షి అనేవాళ్లు. అతని హయాంలో అమ్మవారికి నిత్య పూజార్చనలు జరిగేవి. ఉదయం పూజవేళలో, రాత్రి ఆరతి వేళలో అమ్మవారి సమక్షాన శాస్త్రీయ సంగీతం వినిపించటం అక్కడి ఆనవాయితీ. ఒకగాయకుడు అమ్మవారి సేవలో నియుక్తుడై వుండేవాడు.

శాహూమహారాజ్ దగ్గరి బంధువు బాబూరావు కాగల్కార్. అతనికి సంబంధించిన తానీబాయి కాగల్కార్‌కు శాస్త్రీయసంగీతం పట్ల అవధుల్లేని ఆసక్తి. ఆమె గాత్రం మధురమైంది. గంభీరమైంది. ఒకే ఊపులో అతిమంద్రం నుంచి తారస్థాయి దాక అలవోకగా సంచరించే అద్భుత గాత్రమామెది. మంచి గురువు లభిస్తే ఆమె గొప్ప గాయకురాలు కాగలదని, ఆమె ఆసక్తిమేరకు సంగీతం నేర్పించకపోతే ఆమెలోని సరస్వతికి అపచారం చేసినట్లే అవుతుందని రాజకుటుంబీకులంతా ఆలోచించినారు. మహారాష్ట్రలో గాయనీగాయకులకు ఆనాడు కొదవలేదు. ఈనాడూ లేదు. కొల్హాపూర్‌లో దేవల్‌క్లబ్ స్థాపన జరుగుతున్న కాలమది. ప్రముఖ ఘరానాల గాయనీ గాయకులు, దేవల్‌క్లబ్‌లో జరిగే సంగీత సభల్లో పాల్గొనేవాళ్లు. గ్వాలియర్ ఘరానా, ఆగ్రాఘరానా గాయకులు, పూరబీ అంగ్ ఠుమ్రీ దాద్రాలు పాడేగాయనీమణులు కొల్హాపూర్ సంగీత రసికులకు సుపరిచితులు. అయితే పేచ్‌దార్, పల్టుదార్ తాన్లకు ప్రసిద్ధమైన జైపూర్ ఘరానా సంగీతం తానీబాయి గాత్రానికి తగిందని నిర్ణయించటం జరిగింది. ఉస్తాద్ అల్లాదియాఖాన్ జైపూర్ ఘరానాకు చెందిన గొప్ప గాయకుడు. రాజమాత ఆదేశం మేరకు రాజస్థాన్‌లోని ''ఉన్యారా'' అనే గ్రామంలో వుంటున్న అల్లాదియాఖాన్ దగ్గరికి ఆహ్వానపత్రం పట్టుకొని రాజదూత వెళ్లినాడు. ఉస్తాద్ అల్లాదియాఖాన్ తన తమ్ముడైన ఉస్తాద్ హైదర్ ఖాన్‌తో కలిసి కొల్హాపూర్ చేరుకున్నాడు.1895వ సంవత్సరం అది. కొల్హాపూర్ సంగీతరసికుల అభిమానం, రాజకుటుంబీకుల ఆదరణ అతన్ని అక్కడే కట్టిపడవేసినవి. తన కుటుంబంతో వచ్చి అక్కడే స్థిరనివాసం ఏర్పరచుకొన్నాడు. తానీబాయికి పద్దేళ్లపాటు అతని తాలీమ్ లభించింది. దైవదత్తమైన గంధర్వగాత్రం. ఉస్తాద్ అల్లాదియా శిక్షణ. అనతికాలంలోనే అపర సరస్వతిగా తయారయింది తానీబాయి. రాజకుటుంబంవాళ్లు, రాజ బంధువులు ఆమె సంగీతాన్ని వింటూ ఆనందసాగరంలో ఓలలాడేవాళ్లు.

అప్పుడప్పుడు ఉస్తాద్ వెంట అతని శిష్యప్రశిష్యులు భాస్కర్‌బువాబఖ్లే, నారాయణ్‌రావు బాలగంధర్వ, గోవిందరావు టెంబే లాంటి గాయకులు ఆమె గానం వినేవాళ్లు. ఆమె గాత్ర మాధుర్యానికి, ఆమె తయారీకి అబ్బురపడేవాళ్లు. ''ఈమె రాజవంశానికి చెందింది కనుక, పబ్లిక్‌లో పాడదుగనుక బ్రతికి పోయినాము. పాటకచేరీల్లో ఆమె పాల్గొంటే మాలాంటి వాళ్లకు గాయకవృత్తిని వదిలిపెట్టి కాయకష్టం చేసుకొని బ్రతుకవలసి వచ్చేది'' అన్నారట భాస్కర్ బువాబఖ్లే. అతడు సామాన్యగాయకుడు కాడు. మాస్టర్ కృష్ణారావు, బాలగంధర్వలాంటి ప్రసిద్ధగాయకుల గురువు.

కిరాణా ఘరానాకు చెందిన ఉస్తాద్-అబ్దుల్ కరీంఖాన్ కీర్తి కొల్హాపూర్ వరకు వ్యాపించింది. కాని అతడు కొల్హాపూర్ రాలేదు. అక్కడక్కడ సంగీత సభల్లో అతని గానం విన్న ఒకరిద్దరు రాజబంధువులు ఎలాగైనా అతన్నొకసారి కొల్హాపూర్‌కు ఆహ్వానించాలని శాహూమహారాజ్‌కు విన్నవించుకున్నారు. ఛత్రపతి ఆహ్వానంమీద ఉస్తాద్ అబ్దుల్ కరీంఖాన్ మొదటిసారి కొల్హాపూర్ వెళ్లినాడు. బాబూరావు కాగల్‌కర్ యింట, అంటే తానీబాయి కాగల్‌కర్ యింటనే అతని పాటకచేరీ ఏర్పాటయింది. రాజపరివారానికి, రాజాస్థానానికి చెందినవాళ్లు, సన్నిహితులు, సంబంధీకులు మాత్రమే శ్రోతలు. మార్దవ మాధుర్యాలకు పేరువడ్డది కరీంఖాన్ సాహెబు గాయన శైలి. అమృతోపమమైన, సుకుమార సుందరస్వర విన్యాస విలసితమైన, ఆ మహాగాయకుని గాయనశైలికి శ్రోతలు ఆనందపారవశ్యంతో అంతర్ముఖులైనారు. జయపూర్ ఘరానా అభిమానులో, తానీబాయి అభిమానులో ఆ సభలోనే, ఆవేదిక మీదనే తానీబాయి తన సంగీతాన్ని వినిపిస్తే గొప్పగా వుంటుందని బాబూరావు వెంటపడ్డారు. రాణివాసపు స్త్రీలలో తెరచాటున కూర్చుండి అబ్దుల్ కరీంఖాన్‌గారి సంగీతామృతాన్ని ఆస్వాదిస్తున్న తానీబాయి చెంతకు వెళ్లి బాబూరావు శ్రోతల అభిమతాన్ని శ్రుతపరచినాడు. ఆమె సంస్కారవతి. ''ఖాన్ సాహెబు మన ఆహ్వానం మీద వచ్చిన అతిథి. అతన్ని తగురీతి గౌరవించి పంపటం మనధర్మం. అతని కంటె ముందుగా పాడివుంటే అభ్యంతరం కాదుగాని అతని తర్వాత పాడటం అవమానకరమే. అంతటి ఉస్తాద్ కూర్చున్న ఆసనంమీద అతని తర్వాత అతని యెదుటే కూర్చుండే అర్హతకూడా నాకు లేదు. అది శిష్టాచారమూకాదు'' అని నచ్చజెప్పింది. ''మరి, ఇందరు సంగీత రసికులైన ఆప్తుల మనసు నొప్పించటం కూడ మర్యాద కాదుగదా?'' అని తర్కానికి దిగినాడు బాబూరావు. ''అలా అయితే ఉస్తాదును సగౌరవంగా సాగనంపిన తర్వాత నాసంగీతం విందురుగాని'' అని సముదాయించి పంపింది తానీబాయి.

ఇక్కడొక ముచ్చట చెప్పటం అవసరమో కాదో కాని చెప్తాను. ఉర్దూ ముషాయిరాల్లో, హిందుస్తాన్ సంగీత సభల్లో తొలుత జూనియర్లను వేదిక మీదికి పిలుస్తారు. తర్వాత సీనియర్లను. అందరి తర్వాత ఉస్తాదును పిలుస్తారు. ఉస్తాద్ తర్వాత ఇంకెవరికీ అవకాశం వుండదు.

ఉస్తాద్ అబ్దుల్ కరీంఖాన్ పాటకచేరీ తర్వాత శాహూమహరాజ్ స్వహస్తాలతో సత్కరించి సార్ట్‌బండి మీద అతన్ని సాగనంపినాడు. బండి రెండు ఫర్లాంగుల దూరం వెళ్లిన తర్వాత తానీబాయి గానం మొదలయింది. అబ్దుల్ కరీంఖాన్ చెవుల్లో ఆమె సుమధుర, సుదృఢ గాత్రంలోంచి వెలువడే మలుపుల, మెలికలు తాన్లు పడ్డవి. మేలిమి బంగారు తీగలు మిలమిలలాడుతూ మంద్రస్థాయి నుంచి తారస్థాయి వరకు సాగుతున్న ట్లనిపించిందతనికి. ఆ జలతారు పనితీరు గమనించకుండా కదలలేకపోయినాడు. బండిని వెనుకకు మళ్లించి రాజసౌధం ముఖద్వారం దగ్గర గుఱ్ఱాలు విడిపించి బండిలోనే కూర్చుండి వినసాగినాడు. ''పరజ్ రాగంలోని చీజును విలంబిత్ లయలో ఆలపిస్తూ! అంఖియామోరీలాగీ'' అని జలతారు తీగలల్లుతున్నదప్పుడు తానీబాయి. పాటకచేరీ తర్వాత వెలుపలికి వెళ్తున్న వాళ్లెవరో సార్ట్‌బండిని, అందులో కూర్చున్న ఉస్తాదును చూచి ఆ సంగతి గృహ.యజమానికి తెలియజేసినారు. అతడు ఆదరాబాదరగా వెళ్లి ఉస్తాదును సగౌరవంగా లోనికి తీసుకెళ్లినాడు. ''తమరు లోనికి దయచేయక బయట చలిలోనే వుండిపోయినారేమి?'' అని తానీబాయి ప్రశ్నిస్తే ''మధ్యలో రసభంగం చేయటం ఇష్టం లేక రాలేదమ్మా! మీ సంగీతం నన్ను వెనుకకు లాక్కు వచ్చింది. వీనులవిందుగా విన్నాను'' అని మెచ్చుకున్నాడు ఖాన్ సాహెబ్ అబ్దుల్ కరీంఖాన్. ''సాధన సాగించమ్మా!'' అని సలహా యిచ్చి ఆశీర్వదించినాడు. కాని సాధన సాగలేదు. ఆమె ఏకైక పుత్రిక హఠాన్మరణం ఆమె మనసును తునియలు చేసింది. మళ్లీ ఆమె పాడనే లేదు.

# ఆలోచన - అధ్యాపన

- చంద్రలత

అవసరం అన్వేషణకు మాతృక.

కొత్తను అర్థం చేసుకొనే అవసరం ఆలోచనకు మాతృక.

ఆలోచించడానికి ఒకే ఒక మూలాధారం ఇంద్రియజ్ఞానం.

విషయావగాహనకు ఇంద్రియజ్ఞానం సరిపోనపుడు, శక్తి విహీనం అయినపుడు ఆలోచన మొదలవుతుంది.

ఇంద్రియజ్ఞానంతో ఆరంభమైన ఆలోచన ఆ జ్ఞానానికి అందనంత వరకూ కొనసాగుతుంది. ఆలోచన ఇంద్రియ జ్ఞానాన్ని మించిపోయినా దాని మౌలికాంశాలను మాత్రం వీడిపోదు.

బుద్ధి, గ్రాహ్యతలతో ఆవిర్భవించే ఆలోచన బాహ్య ప్రపంచంతో ప్రత్యక్ష సంబంధం కలిగివుంటుంది. ఆవిధంగా ఆలోచన బాహ్య ప్రపంచానికి ప్రతిబింబం అవుతుంది. ప్రతిరూపం అవుతుంది.

బాహ్య ప్రపంచ సూక్ష్మావగాహన కోసం, సవాలుగా నిలిచే రహస్యాలను ఛేదించడంకోసం, దైనందిన జీవితంలో తారసపడే అనేకానేక విషయాలను, వాటి మధ్య సంబంధ బాంధవ్యాలను అర్థం చేసుకోవడం కోసం - ఆలోచన అవసరం.

ఆలోచిస్తూ ప్రతివ్యక్తీ కొన్ని కొత్త విషయాలను కనిపెడుతూ వుంటాడు.

అవి అత్యల్పమైనవే కావచ్చు. వ్యక్తిగతమైనవే కావచ్చు. అంతకు మునుపే ఆవిష్కరించ బడినవే కావచ్చు.

## ఆలోచన - భాష

ఆలోచనకూ, భాషకూ అవినాభావ సంబంధం వుంది.

మనిషిని మనిషిగా చేసే అద్భుతాలు అవే.

ఆలోచన భాషలో రూపం దిద్దుకుంటుంది. వ్యక్తికీ, వ్యవస్థకూ తత్‌క్షణ సత్యంగా పరిచయం అవుతుంది. ఆలోచన ఏ రూపంలో వున్నా భాషలేనిదే సాధ్యం కాదు. ప్రతి ఆలోచన ఆరంభమయ్యేది, అపరిమితమయ్యేది భాష వల్లే.

ఆలోచన సమగ్రమవుతున్న కొలదీ దానిని వ్యక్తపరిచే భాషస్పష్టమవుతుంది. మౌఖికంగానూ, లిఖితంగానూ.

ఇంకోవిధంగా చెప్పాలంటే - ఆలోచన సంగ్రహమవుతున్న కొలదీ సులభగ్రాహ్యం అవుతుంది.

ఆలోచనను వ్యక్తం చేసేందుకు భాష అవసరం. తన ఆలోచనలను ఇతరులకు వ్యక్త పరచేప్పుడు రూపొందే పదజాలంతో వ్యక్తి మొదట తనకే తను స్పష్టమవుతాడు. కనుక, భాష మాధ్యమంగా వ్యక్తీకరించే మనోభావం ఆలోచన.

మానవుడి ఆలోచనకు అతని సాంఘిక, చారిత్రక, సాంస్కృతిక నేపథ్యం వుంటుంది.

సాధారణంగా వ్యక్తి ఆలోచన మానవ భావ వికాస చరిత్రకు పరంపరగా కొనసాగుతుంది. అయితే, ఆలోచన ఒక నిర్దిష్టరూపం పొంది, జ్ఞానంగా పెంపొంది - ఒక వ్యక్తి నుంచి ఒక వ్యక్తికీ - ఒక తరం నుంచి ఒక తరానికే అందించబడినపుడే ఇది సాధ్యం. వ్యక్తి ఆలోచనకు సామాజిక గుణం ఈ ఒరవడిలోనే అబ్బుతుంది.

మానవుడి భాషతోపాటే ఆలోచనాపరిధి విస్తృతంగా పెరిగిపోయింది. పెరుగుతూనే ఉంది.

అర్థం కల శబ్దం భాష అవుతుంది. ఆలోచన భాషకు భావం నింపుతుంది. భావం పొందిన భాష సహేతుకమైన, సతర్కమైన, వివేకవంతమైన భావనకు ఆధారం అవుతుంది. అది జ్ఞానంగా రూపొందుతుంది.

## ఆలోచన - చిన్నారులు

బాలలకే స్వంతమైన భావప్రపంచం ఒకటి వుంది. ప్రఫుల్లమైన, ప్రమోదమైన ఆ ప్రపంచానికి నిర్మాతలు వారే.

అయితే, దాని స్వరూప స్వభావాలను నిర్ధారించడంలో వారి సంగ్రహణ శక్తికి సన్నిహిత పరిసరాలు, సంబంధ బాంధవ్యాలు తోడవుతాయి. ఆ క్రమంలో వారి భావప్రపంచం బాహ్యప్రపంచంచే ప్రభావితం అవుతుంది.

మానవ సహజమైన శాస్త్రీయ దృక్పథం - పరిశీలించడం, పరిశోధించడం, ప్రయోగించడం, ప్రమాణీకరించడం - పసివయసులో చాలా సహజంగానే ప్రకటితమవుతుంది. బాలల మానసిక పరిణామ క్రమంలో అనుక్షణం వారి సునిశిత దృష్టికి వచ్చే విషయాలను ఈ దృక్పథంతోనే పరీక్షించి, తత్‌క్షణ నిర్ణయాలకు వస్తుంటారు. కొన్ని ఆదర్శాలను, ఆశయాలను ఏర్పరచుకొంటారు. వాటన్నిటికీ ఆధారభూతమైన ఆలోచనాశక్తిని పెంపొందించుకుంటారు.

ఓ ఆలోచన ఏర్పడడంలో విశ్లేషణ, సంశ్లేషణ/ క్రోడీకరణ ప్రధానపాత్ర వహిస్తాయి.

చిన్నపిల్లలు తరుచు బొమ్మలు విరగ్గొట్టడం మనం గమనిస్తూనే వుంటాం. బొమ్మల లోపల ఏముంటుందో తెలుసుకోవాలన్న కుతూహలం చేత వారలా చేస్తుంటారు. అలా ఆటవస్తువులను ఏ భాగానికి ఆ భాగం విడదీయడంతో వారిలోని విశ్లేషణ ప్రకటిత మవుతుంది. ఇది వారు ఆ వస్తువును అవగాహన చేసుకొనే ప్రయత్నంగా చెప్పవచ్చును.

విశ్లేషణ ఒక ముఖ్యమైన, అవసరమైన, ఆసక్తిదాయకమైన పరిణామం.

విశ్లేషించిన వాటిని తిరిగి జత చేయడం క్రోడీకరణ అవుతుంది.

క్రోడీకరించబడిన విషయం పూర్వ విషయమే కావచ్చు. పూర్వ విషయంతో సంబంధం లేనిదే కావచ్చు. అలా అపూర్వ విషయావిర్భావానికి క్రోడీకరణ నాంది అవుతుంది. అదే సృజన.

ఒక పిల్లవాడు ఒక కుందేలు బొమ్మను, మరొక బాతు బొమ్మను ఒకేసారి విశ్లేషించాడని అనుకొందాం. తిరిగి వాటిని జతచేసేటప్పుడు కుందేలు బొమ్మకు బాతు తల, బాతుకు కుందేలు తల పెట్టాడని అనుకొందాం. అంతకు పూర్వం లేని రెండు ఆకారాలు ఆవిర్భవించాయి. అదే నూతన సృష్టి.

అనునిత్యం సవాలుగా నిలిచే అనేక అంశాలను తదుపరి పరిణామాలను ఊహించి, సాధ్యాసాధ్యాలను, తరుణోపాయాలను ఆలోచించడంతో పరిష్కారం సృష్టించ బడుతుంది.

ఈ పరిణామంలో ముఖ్య పాత్ర వహించేది ఊహ. ఊహాశక్తి భాషతోపాటు వృద్ధి చెందుతుంది భాష అంతకు మునుపు చూడని విషయాలను ఊహించడానికి ఉపయోగపడుతుంది. ఊహ మానవ మనుగడకు నిర్దేశకమవుతుంది.

విశ్లేషణ, క్రోడీకరణ అవినాభావ సంబంధం కలిగి వుంటాయి. వాటి సంబంధం విషయావగాహనలో ప్రకటిత మవుతుంది. విషయాన్ని అర్థం చేసుకొనే క్రమంలో ఒక విషయాన్ని మరొక విషయంతో పోల్చి చూడడం జరుగుతుంది. అదీ క్రోడీకరణ సమయంలో.

పోలికకై ఆ విషయాన్ని నిశితంగా విశ్లేషించాల్సి వుంటుంది. భిన్న విషయాలలోని భేదాలను, సామ్యాలను తెలుసుకొనేందుకు పోలిక అవసరం. ఇలా పోల్చి చూడడం సాధారణీకరణకు దారి తీస్తుంది. అలా ఆలోచన ప్రవర్ధమానమవుతుంది. జ్ఞానం నిర్దిష్టమవుతుంది.

ఆలోచనకు మూలం సందేహం. జ్ఞానానికి మూలం ఆలోచన.

అలా జ్ఞానానికీ మూలం మళ్ళీ సందేహమే అవుతుంది. శాస్త్రీయతకూ మూలం సందేహమే.

సందేహం కూడా సహజ ప్రకటితమే. సందేహాన్ని శాస్త్రీయతగా మలుచుకున్న వాడు జ్ఞానసంపన్నుడు అవుతాడు.

అందులో సందేహం లేదు!

## ఆలోచన - అధ్యాపన

బాలల సామాజికీకరణలో కుటుంబం తరువాత ప్రధాన పాత్ర వహించేది పాఠశాల. కుటుంబ సభ్యుల తరువాత ప్రభావం చూపేది అధ్యాపకులు. ప్రాబల్యం చూపేది సహాధ్యాయులు.

సామాజిక, సాంస్కృతిక, నైతిక విషయాలను కుటుంబంలో కుటుంబ సభ్యుల ద్వారా నేర్చుకోవడం మొదలు పెట్టిన పిల్లలు - ఆయా అంశాలను పాఠశాలలో అధ్యాపకుల దృష్టితో పరిశీలించడం కొనసాగిస్తారు.

ఆ క్రమంలో వారు ఆ యా అంశాలపై కొన్ని నిర్దిష్టమైన అభిప్రాయాలకు వస్తారు యిష్టాయిష్టాలను ఏర్పరచుకొంటారు.

మొదటి మూడు సంవత్సరాల్లోనూ బాలల ఆలోచన వాస్తవ దృక్పథం కలిగివుంటుంది. పసివాడి ఆలోచన తక్షణ వాస్తవంలోంచి వృద్ధి చెందుతుంది. ఆ సమయంలో తన స్వంత పరిశీలనతో, పరిశోధనతో విశ్లేషించి, క్రోడీకరించి విషయావగాహన చేసుకొంటాడు.

విద్యార్థి ఆలోచన మొదట ఇంద్రియజ్ఞాన - దృశ్య సంబంధమై వుంటుంది. రాను రా మరింత సమగ్రంగా రూపొందుతుంది. విద్యార్థి దశలో ఆలోచన కేవలం వాస్తవ ప్రయోగాలతోనూ, ఊహాశక్తితోనూ మాత్రమే కాక సిద్ధాంత భావాల సంపర్కంతోనూ, తర్కంతోనూ పెంపొందుతుంది. భౌతిక శాస్త్రం, గణితం, చరిత్ర మొదలైనవి విద్యార్థి ఆలోచన ఎదుగు దలలో ప్రముఖ పాత్ర వహిస్తాయి.

విద్యార్థులు తమ విద్యార్థి జీవితంలో సంసిద్ధంగా వున్న విజ్ఞానాన్ని అందుకుంటారు. ఈ సిద్ధపరచి వుంచిన జ్ఞానం మానవాళికి కొత్తకాదు. కానీ విద్యార్థులకు ఖచ్చితంగా కొత్త. కనుక - అప్పటికే శోధించబడి, సాధించబడిన సత్యాలన్నిటినీ విద్యార్థులు మరోమారు స్వయంగా శోధించి, సాధించాల్సి వస్తుంది. ఈ శోధన, సాధన విద్యార్థుల వ్యక్తిగత ఆలోచన రూపొందడానికి మూల కారణా లవుతాయి. సృజనకు ఆధారాలు అవుతాయి.

సృజనాత్మకత లేని జ్ఞానసాధన యాంత్రికం, మొక్కుబడి ధర్మం, పైపైని వ్యవహారం అవుతుంది. సృజనాత్మకత బాలల వ్యక్తిత్వానికి నూతన సొబగులు దిద్దుతుంది. వారి మానసిక వికాసానికి ఆలోచనకు వున్నంత ప్రాధాన్యత సృజనకూ వుంది.

వాస్తవ భావన, సిద్ధాంత భావన, బాలల మానసిక వికాసానికి ప్రాథమిక సూత్రాలు అవుతాయి; తద్వారా మానవ భావ పరిణామానికి.

ఇప్పటి మన సామాజిక స్థితి మనందరకూ తెలిసిందే. మన భావి సామాజికులు అనేక అవాంఛనీయమైన ప్రలోభాల మధ్యా, అనివార్యమైన ప్రభావాల మధ్యా ఎదగాల్సి వుంది. ఎన్నో ఒడుదుడుకులను అధిగమించాల్సి వుంది. సద్భావనా సంపన్నులుగా, సంస్కార వంతులుగా రూపొందాల్సి వుంది. దీనికై వారు నైతిక దృక్పథం పెంపొందించు కోవాలి.

మానవ విలువలను, నైతిక విలువలను అవగతం చేసుకోవడం సులభతరం కాదు. ఆలోచనకు వివేచన తోడవ్వాలి. నైతిక విలువలు మానవ శ్రేయస్సుకై మానవ చరిత్ర గమనంలో పరిణమించినవే. అయినా - ఆ విలువలకు నీలినీడలు కమ్మకుండా, పాతబడి పోకుండా ఎప్పటికప్పుడు నివారించగలిగేది - నూతన దిశలో నడపించ గలిగేది శాస్త్రీయ దృక్పథం మాత్రమే.

ఉద్రేకాలను అణచి, భావుకతను ఉత్తేజ పరచి, ఉల్లాస హృదయులను చేయగల శక్తి లలిత కళలకు వుంది. బాలల భావ ప్రపంచానికి రమ్యతను, సౌమ్యతను చేకూర్చడం కూడా అవసరం. ఎందుకంటే-

'చదువది యెంత గల్గిన రసజ్ఞత యించుక చాలకున్న నా చదువు నిరర్థకంబు'

విద్యార్థుల అధ్యయనంలో అంతర్భాగమైన భాషాధ్యయనాలు, సాహిత్య పరిచయాలు, అడపా దడపా నిర్వహించే సాంస్కృతిక కార్యకలాపాలు వారిలో రసాత్మక దృక్పథం పెంపొందించుకోను ఉపయోగపడతాయి.

అయితే, సాహిత్యం వలన ఓ చిన్న చిక్కు వుంది. సాహిత్యంలో అనేక అశాస్త్రీయమైన అంశాలు అందంగా భద్రపరచబడి వున్నాయి. అసత్యాలు సత్యాలుగా సిద్ధాంతీకరించబడి అమర్చి వున్నాయి. అవి ఆకర్షణీయంగా, అంచెలంచెలుగా ప్రకటితమవుతాయి.

సాహిత్య సత్యాలన్నీ శుద్ధ సత్యాలు కావు. సత్యం శాస్త్రీయదృక్పథంతో పరీక్షించినపుడే నిర్ధారించ బడుతుంది. అధ్యాపకులు విద్యార్థులకు వివరణ ఇచ్చేటపుడు సాహిత్యంలోని కూర్పుకు, లయకు, భావానికి స్పందించడం, ఆనందించడం నేర్పుతూనే.... శాస్త్రీయ దృక్పథంతో విశ్లేషించడం నేర్పాలి. ఎందుకంటే సాహిత్య సత్యాలు అన్నివేళలా శుద్ధ సత్యాలు కావన్న వాస్తవాన్ని కూడా విద్యార్థులు గుర్తించడం అవసరం. సాంస్కృతిక ప్రయోజనాల దృష్ట్యా, నైతిక ప్రయోజనాల దృష్ట్యా.

సంగీతం, నృత్యం, చిత్రలేఖనం మొదలైనవి సాంస్కృతిక కార్యకలాపాలుగా పరిచయం చేయబడేది విద్యార్థి దశలోనే.

సాంస్కృతిక కార్యక్రమాలు వారిలో నిక్షిప్తమైవున్న కల్పనా చాతుర్యాన్ని వెలికితీయ గలిగేలా వుండాలి. నిబిడీకృతమై వున్న సృజనాత్మకతకు రూపం ఇచ్చి ప్రదర్శించ గలిగేలా వుండాలి. అల్లిబిల్లి ఆలోచనలకు నిర్దిష్టత చేకూర్చి ప్రకటించగలిగేలా వుండాలి.

ఆలోచన శాస్త్రీయ దృక్పథానికి ప్రధానం. వివేచన నైతిక దృక్పథానికి ప్రధానం. అనుభూతి రసాత్మక దృక్పథానికి ప్రధానం. వీటిలో ఏది లోపించినా ఆ అధ్యయనం అసంపూర్ణం అవుతుంది. ఆ జ్ఞానం అసమగ్రం అవుతుంది.

విద్యార్థికి అందించే జ్ఞానం సామాజిక, సాంస్కృతిక, చారిత్రక పరిధుల్లో ఇమిడి వుంటుంది. జ్ఞానాన్ని సులభగ్రాహ్యం చేయడానికి అధ్యాపకుని భావ వ్యక్తీకరణ సరళంగానూ, స్పష్టంగానూ వుండడం అవసరం.

కొన్ని కొన్ని సందర్భాల్లో ఆలోచనను విశ్లేషించి, విపులీకరించేటప్పుడు అధ్యాపకుని వివరణ వక్రీకరించే అవకాశం వుంది. అధ్యాపకుని వ్యక్తిగత భావాలు వాస్తవాన్ని పెడతోవ పట్టించే అవకాశం వుంది. మరికొన్నిసార్లు విద్యార్థి కల్పనాశక్తికి కానీ, ఆలోచనా పటిమకు గానీ, సృజనాత్మకతకు కానీ తావివ్వకుండా నియంత్రించే అవకాశం వుంది.

భిన్న మేధాస్థాయి, భిన్న మనస్తత్వాల బాలలు ఒకే తరగతిలో సమీకృతమైనపుడు కొందరి గ్రహణ శక్తి తక్కువ కావచ్చు. కొందరు అధ్యాపకుని నిర్లక్ష్యానికి గురి కావచ్చు. ఇంకొందరు అధ్యాపకుని అభిమాన పాత్రులు కావచ్చు. మరికొందరి కుతూహలానికీ, ఆసక్తికీ తగిన ప్రోత్సాహం లభించక పోవచ్చు.

అధ్యాపనకాలం విద్యార్థిలోని సహజ ప్రకటితాలైన ఆలోచనకు, ఊహకు, సృజనాత్మకతకు అభ్యాసకాలంగా వుండాలి. వారిలో అంతర్లీనంగా వున్న ప్రతిభావ్యుత్పత్తులు వెలుగులోకి తీసుకురాబడి, నిపుణుల చేతిలో మెరుగులు దిద్దబడాలి. సామాన్యమైన విషయాలను అసామాన్యంగానూ, సాధారణమైన అంశాలను అసాధారణంగానూ విశ్లేషించి, క్రోడీకరించ గలిగే మేధాస్థాయిని పెంపొందించుకొనేలా విద్యార్థులను ప్రోత్సహించాలి.

ఎందుకంటే, వీరు సమాజంలోని వ్యక్తులుగానే కాక పూర్ణ వ్యక్తులుగా, ప్రత్యేక వ్యక్తులుగా ప్రముఖ వ్యక్తులుగా ఎదగాలి.

తమ తమ రంగాలలో నిష్ణాతులైన వ్యక్తులే మానవ మనుగడను శోభాయమానం చేయగలరు.

ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ అధ్యాపకుని ప్రభావం విద్యార్థి ప్రవర్తన మీదా, పరివర్తన మీదా వుంటుంది. కనుక - అధ్యాపకుడు నిబద్ధతతో, నిజాయితీతో, చిత్త శుద్ధితో, శ్రద్ధతో వ్యవహరించ వలసి వుంటుంది.

వ్యవహరించాలి!

అది గురుతరబాధ్యత!!

The image of teenagers as menacing and rebellious is a big fiction that's boomeranging on kids. We've mythologized adolescence to conceal a startling fact: It is indeed a difficult and turbulent time—for parents. The trouble is, kids look like adults much sooner than ever before. Kids wind up feeling abandoned—and angry at the loss of their safety net. If we haven't got adolescence exactly figured out yet, there's some consolation in the fact that it's a brand-new phenomenon in human history.

By Virginia Rutter